# కృష్ణ చైతన్యం

# అద్వితీయ వరప్రసాదం



అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘ సంస్థాపకాచార్యులు

పరమపూజ్యశ్రీ శ్రీమత్

ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాదులు

I BNR01A106 H=7.2
W=4.6

శ్రీ గురు గౌరాంగౌ విజయేతామ్

K. Nagabhushana Rao
B. Com:
A. P. TRANS Co., Ltd:

# కృష్ణ చైతన్యం - అద్వితీయ వరప్రసాదం

K. Nagabhushana Rao,
B. Com:
A. P. TRANS Co., Ltd:

అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘ సంస్థాపకాచార్యులు

పరమపూజ్యశ్రీ శ్రీమత్

ఏ.సి.భక్తివేదాంత స్వామి ప్రభుపాదులు

K. Nagabhushana Rao,
B. Com:
A. P. TRANS Co., Ltd:



ప్రకాశకులు :

భక్తివేదాంత బుక్ ట్రస్ట్

హరే కృష్ణ ల్యాండ్, నాంపల్లి స్టేషన్ రోడ్

హైదరాబాద్ - 500 001

## పరమపూజ్యశ్రీ శ్రీమత్ ఏ.సి.భక్తివేదాంత స్వామి ప్రభుపాదుల వారి రచనలు :

- భగవద్గీత యథాతథము
- శ్రీమద్భాగవతము (18 సంపుటములు)
- శ్రీ చైతన్య చరితామృతము (9 సంపుటములు)
- శ్రీ చైతన్య మహాప్రభు బోధామృతము
- దేవాదిదేవుడు శ్రీకృష్ణభగవానుడు
- భక్తి రసామృతము
- ఆత్మసాక్షాత్కార శాస్త్రం
- కుంతీ మహారాణి ఉపదేశములు
- దేవహూతి కుమారుడైన కపిల భగవానుని ఉపదేశములు
- ద్వితీయ అవకాశం
- జ్ఞానఖడ్గము
- ఆత్మాన్వేషణము
- భ్రమ మరియు సందేహములకు అతీతముగా...
- జ్ఞాన పరిశోధన
- శ్రీ ఈశోపనిషత్తు
- ఉపదేశామృతం
- ఉత్తమ ప్రశ్నలు - ఉత్తమ సమాధానాలు
- గ్రహాంతర సులభ యానం
- కృష్ణ చైతన్యమే సర్వోత్తమ యోగం
- యోగసిద్ధి పథం
- ప్రకృతి నియమాలు - దోషరహిత న్యాయము
- ప్రహ్లాద మహారాజు యొక్క దివ్య బోధనలు
- జీవం నుండి జీవం
- రాజవిద్య
- యోగ పరిపూర్ణత
- జనన మరణాలకు అతీతంగా...
- శ్రీకృష్ణుని చేరే మార్గం
- పునరావృత్తి
- కృష్ణ చైతన్య సాధన
- కృష్ణ చైతన్యం అద్వితీయ వరప్రసాదం
- శ్రీకృష్ణుడు - ఆనందనిధి
- దైవనాగరికత
- సనాతన ధర్మం
- హరే కృష్ణ సవాల్
- హరినామ సంకీర్తనం చేయండి ఆనందించండి!
- భక్తియోగ
- భగవత్ సందేశం
- ప్రేమభక్తి కళ
- భగవద్దర్శనం (సంస్థాపకుని ఆధ్యాత్మిక మాసపత్రిక)

III

K. Nagabhushana Rao,
B. Com:
A. P. TRANS Co., Ltd:

# విషయసూచిక




K. Nagabhushana Rao,
B. Com:
A. P. TRANS Co., Ltd:

IV

ఈ పుస్తకములోని విషయాలపై ఆసక్తి గల పాఠకులు భక్తివేదాంత బుక్ ట్రస్ట్ వారి 'కార్యదర్శి'ని ఈ క్రింది చిరునామా యందు సంప్రదించగలరు :

భక్తివేదాంత బుక్ ట్రస్ట్
హరే కృష్ణ ల్యాండ్, నాంపల్లి స్టేషన్ రోడ్
హైదరాబాద్ - 500 001

Krishna Consciousness : The Matchless Gift (Telugu)

*తెలుగు అనువాదం :*

**డా॥ శ్రీ తిరుమల రామచంద్ర**

**శ్రీమాన్ విజయకుమార్ దాస**

1st printing in India : 5,000 copies
2nd to 13th printing : 60,380 copies
14th printing, August 2013 : 5,000 copies

K. Nagendra ... B. Com:
A. P. TRANS Co., Ltd: 1

# 1. శ్రీకృష్ణుని ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానం

జీవులందరు తమ నిజచైతన్యాన్ని తిరిగి పొందేలా చేయడమే కృష్ణ చైతన్యోద్యమం యొక్క ముఖ్యోద్దేశం. భౌతిక జగత్తులోని ప్రాణులన్నీ వివిధ పరిమాణాలలో ఒక విధమైన ఉన్మాదంతో బాధపడుతున్నాయి. ఈ భౌతిక వ్యాధిని కుదిర్చి ప్రతిజీవికి తమ నిజమైన చైతన్యాన్ని తిరిగి ఉదయింప జేయుటయే కృష్ణ చైతన్యోద్యమ లక్ష్యం. బెంగాలీ పద్యంలో ఒక గొప్ప వైష్ణవ కవి ఇలా అన్నారు, “మానవుడు ఏదైన భూతం చేత ఆవేశించబడినప్పుడు, అతడు ఏవేవో ఉన్మత్త ప్రలాపాలను మాత్రమే చేస్తాడు. అలాగే, భౌతిక ప్రకృతి ప్రభావంలో ఉన్నవాడు కూడా భూతం ఆవేశించిన వానితో సమానమైనవాడే! అతడు మాట్లాడే మాటలన్నీ ఉన్మత్త ప్రలాపాలే” అవుతాయి అని. మహాతత్త్వవేత్త అయినా విజ్ఞాన శాస్త్రవేత్త అయినా మాయాపిశాచం అతనిని ఆవహించినప్పుడు అతడు తెలిపే సిద్ధాంతాలు కాని, అతడు చేసే ప్రసంగాలు కాని చాలావరకు ఉన్మాద పూరితాలే! ఈరోజు నేనొక ఉదాహరణను ఇచ్చాను అదేమిటంటే, ఒక మానసిక వైద్యనిపుణుని వద్దకు కొందరు వచ్చి ఒక హంతకుని పరీక్షించమని అడిగారట! అప్పుడు అతడు, తన దగ్గరకు వచ్చే రోగులందరు ఏదో విధమైన ఉన్మాదంతో బాధపడేవారే గనుక అదే కారణం చూపించి, న్యాయస్థానం ఒప్పుకుంటే అతనిని క్షమించవచ్చునని ఆ మానసిక వైద్యనిపుణుడు అన్నాడట! అందుచేత భౌతిక జగత్తులో ఉన్మాదంలేని వ్యక్తిని గుర్తించడం ఎంతో కష్టం. ఈ జగత్తులో ఇలాంటి ఉన్మాద వాతావరణం ఉండడానికి కారణం భౌతిక చైతన్యమనేది ఒక అంటు వ్యాధిలాగ వ్యాపించడమే!

మానవుడు తమ నిజ చైతన్యాన్ని అంటే పవిత్రమైన కృష్ణ చైతన్యమును తిరిగి పొందేలా చేయడమే కృష్ణ చైతన్యోద్యమ లక్ష్యం. మేఘాలు వర్షించే నీరు వడపోసిన నీరులాగ నిర్మలంగా ఉంటుంది. అయితే ఆ నిర్మలమైన నీరు భూమిని తాకగానే మురికినీరుగా మారిపోతుంది. అలాగే మనం కూడా మొదట శుద్ధమైన జీవాత్మలము, శ్రీకృష్ణుని అంశలము. అందుచేత మన నిజస్థితి కూడా భగవంతుని స్థితిలాగ స్వచ్ఛమైంది. భగవద్గీత (15.7) లో శ్రీకృష్ణుడిలా చెబుతున్నాడు :

మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః
మనఃషష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి

"ఈ బద్ధ జగత్తునందలి జీవులందరును నా శాశ్వతాంశములు. బద్ధ జీవితము కారణముగా వారు మనస్సుతో కలిపి ఆరైన ఇంద్రియములను గూడి వారు తీవ్ర సంఘర్షణము సలుపుచున్నారు."

అందుచేత ప్రాణులన్నీ శ్రీకృష్ణుని అంశలే! శ్రీకృష్ణుడు అంటే భగవంతుడేనని మనం ఎల్లప్పుడు గుర్తుంచుకోవాలి. శ్రీకృష్ణుని నామం అందరినీ ఆకర్షిస్తున్న, దేవాదిదేవుడైన పరమపురుషుణ్ణి సూచిస్తూ ఉంది. చిన్న బంగారపు ముక్కకు బంగారపు గనిలోని బంగారపు గుణమే ఉన్నట్లు, శ్రీకృష్ణుని అంశలు శ్రీకృష్ణునితో గుణైక్యము కలిగినట్టివే! భగవంతుని దేహంలోని రసాయన సమ్మేళనం, జీవుల శాశ్వత ఆధ్యాత్మిక దేహనిర్మాణం ఒకలాంటివే, ఆధ్యాత్మికమైనవే! ఆ విధంగా, ప్రారంభంలో నిష్కల్మష స్థితిలో మనం భగవంతునితో సమానమైన రూపాన్నే కలిగి ఉండేవాళ్ళము. వర్షపు నీరు భూమిపై పడి కలుషితమైనట్లు, శ్రీకృష్ణుని బాహ్యభౌతిక శక్తి వలన కల్పితమైన ఈ భౌతిక జగత్తులోపడి మన స్వచ్ఛతను పోగొట్టు కుంటున్నాము.

మనం బాహ్యశక్తిని గురించి లేక భౌతిక ప్రకృతిని గురించి ప్రస్తావించినపుడు : "ఎవరీ శక్తి ? ఎవరీ ప్రకృతి ?" అనే ప్రశ్నలు కలుగ వచ్చును. భౌతికశక్తి లేక భౌతిక ప్రకృతి స్వతంత్రంగా పనిచేయగలదని వాదిస్తే అది వివేకరహితమైన సిద్ధాంతమే! భౌతిక ప్రకృతి స్వతంత్రంగా పని చేయలేదని భగవద్గీతలో స్పష్టంగా వివరించబడింది. ఒక యంత్రం పనిచేస్తుండడం చూచి అది దానంతట అదే పనిచేస్తూ ఉందని బుద్ధిహీనుడు భావిస్తాడు. కాని నిజానికీ అది అలా పనిచేయదు. దానిని నడిపించేవాడు, అదుపులో ఉంచేవాడు ఎవరో ఒకడు ఉంటాడు. అలా అదుపు చేస్తూన్న వానిని నడిపిస్తున్న వానిని ఒక్కొక్కసారి మనం మన దృష్టిలోపం వలన చూడలేము. అద్భుతంగా పని చేసే ఎన్నో ఎలక్ట్రానిక్ యంత్రాలు ఉన్నాయి. ఆ సూక్ష్మయంత్ర విధానం వెనుక ఒక విజ్ఞాన శాస్త్రవేత్త తప్పకుండా ఉంటాడు. అతడు మీట నొక్కుతాడు. అవి పని చేస్తాయి. ఈ విషయం అర్థం చేసుకోవడం చాలా సులభం. యంత్రం అచేతన భౌతిక పదార్థం. కనుక దానంతట అది పనిచేయలేదు. అది ఆధ్యాత్మిక దర్శకత్వం క్రిందనే పనిచేస్తుంది. శబ్దగ్రహణ యంత్రం(టేప్ రికార్డర్) పనిచేస్తుందంటే, ఒక మనిషి దర్శకత్వం ప్రకారం అతని ఆలోచనలను అనుసరించే అది పనిచేస్తుంది. ఒక యంత్రం సంపూర్ణమైనదే కావచ్చు. కాని ఒక జీవాత్మ దానిని నడిపించకపోతే అట పనిచేయలేదు. అదే విధంగా మనం ప్రకృతి అని పిలిచే ఈ భౌతిక జగత్తు ఒక పెద్ద యంత్రం, దీనిని వెనుక నుండి నడిపించేవాడు శ్రీకృష్ణభగవానుడు. ఈ విషయమును కూడా ధ్రువపరుస్తూ శ్రీకృష్ణుడు భగవద్గీత (9.10) లో ఇలా అన్నాడు :

మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్
హేతునానేన కౌన్తేయ జగద్విపరివర్తతే

"ఓ కౌంతేయా! నా శక్తులలో ఒకటైన ఈ భౌతిక ప్రకృతి నా పర్యవేక్షణలో పని చేస్తూ, స్థావర జంగమములను ఉత్పాదించు చున్నది. దాని నియమమును అనుసరించే ఈ వ్యక్త జగత్తు మరల మరల సృష్టించబడుచు, లయము పొందుటయు జరుగుచున్నది."

సృష్టి స్థావర, జంగమములనీ రెండు విధాలు. మనుష్యులు, జంతువులు, క్రిమికీటకాదులు జంగమములు. చెట్లు, కొండలు స్థావరాలు. స్థావర జంగమములని రెండు రకాల సృష్టినీ అదుపులో పెట్టి, భౌతికప్రకృతి తన పర్యవేక్షణలో పనిచేస్తూందని శ్రీకృష్ణుడు చెబుతున్నాడు. కాబట్టి ప్రకృతిలోని ప్రతివస్తువు వెనుక ఒక పరమ నియంత ఉన్నాడు. ఆధునిక నాగరికత అజ్ఞానం చేత ఈ విషయాన్ని తెలుసుకో లేకపోతూంది. అందుచేత త్రిగుణాత్మకమైన ప్రకృతి ఆకర్షణ వలన వ్యామోహితులైన ప్రజలందరినీ జ్ఞానవంతులను చేయడమే అంతర్జాతీయ కృష్ణ చైతన్యసంఘపు లక్ష్యం.

ఈ ప్రపంచంలో ముఖ్యంగా యునైటెడ్ స్టేట్స్ అఫ్ అమెరికాలోని విశ్వవిద్యాలయాలలో అనేక విజ్ఞానశాఖలు ఉన్నాయి. కాని అవేవీ ఇలాంటి తాత్త్వికాంశాలను చర్చించవు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఉపదేశించిన జ్ఞానాన్ని బోధించే శాఖ ఎక్కడైన ఉందా? లేదు. మెస్సాచుసెట్స్ సాంకేతిక విద్యాసంస్థ(ఎమ్.ఐ.టి.) లో నేను ఒకసారి విద్యార్థుల, ఉపాధ్యాయుల సమావేశంలో ప్రసంగించినప్పుడు : "మరణించిన వాడికి బ్రతికి ఉన్నవాడికి మధ్య గల భేదాన్ని పరిశోధించే సాంకేతిక విభాగం ఎక్కడ ఉంది?" అనే విషయం మొదట చర్చకు వచ్చింది. మనిషి మరణించినప్పుడు అతనిలో కొన్ని పదార్థాలు లోపిస్తున్నాయి. ఆ లోపాలను పూరించగల సాంకేతిక జ్ఞానం ఎక్కడ ఉంది? పదార్థ విజ్ఞాన శాస్త్రవేత్తలు ఈ సమస్యను పరిష్కరించడానికి ఎందుకు ప్రయత్నించడం లేదు? ఎందుకంటే, ఈ సమస్యకు పరిష్కారం చాలా కష్టమైనది కనుక విజ్ఞాన శాస్త్రజ్ఞులు దీనిని

ఒక ప్రక్కన పెట్టి, ఆహార - నిద్రా - భయ - మైథునాదుల సాంకేతిక చర్చలలో నిమగ్నులయ్యారు. ఇటువంటి విజ్ఞానం పాశవికమని వైదిక సాహిత్యం ప్రకటిస్తుంది. ఎందుచేతనంటే, పశువులు కూడా మంచి ఆహారాన్ని భుజించడానికీ, కామసుఖాన్ని అనుభవించడానికీ, ప్రశాంతంగా నిద్రపోవడానికీ ఆత్మరక్షణ చేసుకోవడానికీ చేతనైనంత వరకు ప్రయత్నిస్తాయి. అలాంటప్పుడు మనిషి జ్ఞానానికీ, పశువుల జ్ఞానానికీ మధ్య తేడా ఏమిటి? నిజానికి బ్రతికి ఉన్న మనిషికీ, మరణించిన మనిషికీ, జీవించి ఉన్న దేహానికి మరణించిన దేహానికి గల బేధమును పరిశోధించి తెలుసుకోవడానికి మనిషి జ్ఞానం అభివృద్ధి చెందాలి. ఈ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని శ్రీకృష్ణుడు అర్జునునికి భగవద్గీత ఆరంభంలోనే వివరించాడు. అర్జునుడు శ్రీకృష్ణునికి స్నేహితుడు కావడం వలన, అతడు గొప్పజ్ఞానం కలవాడై నప్పటికినీ, ఇతర మానవుల జ్ఞానం వలెనే అర్జునుని జ్ఞానం కూడా పరిమితమైనది. శ్రీకృష్ణుడు అర్జునుని పరిమిత జ్ఞానానికి అతీతమైన విషయాలను వివరించాడు. ఈ విషయాలను 'అధోక్షజాలు' అంటారు. ఎందుకంటే, మనకు భౌతిక జ్ఞానాన్ని సంపాదించి పెట్టగల ప్రత్యక్ష దృష్టితో వాటిని గ్రహించలేము కనుక. ఉదాహరణకు, మన పరిమిత దృష్టితో చూడలేని కొన్ని వస్తువులను చూడడానికి మనకు ఎన్నో శక్తిమంతాలైన సూక్ష్మదర్శినీ యంత్రాలున్నాయి. కాని మన దేహ అంతర్భాగంలో కల ఆత్మను చూపగల సూక్ష్మదర్శినీ యంత్రం మాత్రం ఎక్కడా లేదు. అయినా ఆత్మ ఉండనే ఉంది.

మన ఈ దేహంలో ఒక యజమానుడు ఉంటాడని భగవద్గీత తెలుపుతుంది. నేను ఈ దేహానికి యజమానుణ్ణి; ఇతరులు తమతమ దేహాలకు యజమానులు. నేను "నా చేయి" అని అంటున్నాను. కాని "నేను చేతిని" అని అనడం లేదు. "నా చేయి" కనుక నేను దానికి

యజమానుణ్ణి కాబట్టి నేను దానికంటె భిన్నుణ్ణి. అలాగే మనం "నా కన్ను", "నా కాలు", "ఇది నాది", "అది నాది" అంటున్నాము. నాకు సంబంధించిన ఈ వస్తువులన్నింటి మధ్య నేను ఎక్కడ ఉన్నాను? ఈ ప్రశ్నకు సమాధానాన్ని అన్వేషించడమే ధ్యానమార్గం. నిజమైన ధ్యానంలో మనం : "నేను ఎక్కడ ఉన్నాను? నేను ఎవరిని?" అని ప్రశ్నించుకుంటాము. ఈ ప్రశ్నలకు సమాధానం భౌతిక ప్రయత్నాల వలన మనకు దొరకదు. అందువలననే విశ్వవిద్యాలయాలన్నీ ఈ ప్రశ్నలను పక్కన పెడుతున్నాయి. "ఇది బహు కష్టమైన సంగతి" అని, లేదా "ఇది అసంగతమైనది" అని దానిని ప్రక్కకు త్రోసివేస్తున్నాయి. ఈ విధంగా ఇంజనీర్లు గుర్రాలులేని బండిని, రెక్కలులేని పక్షిని సృష్టించి వాటిని నిర్దుష్టం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. పూర్వం బండ్లను గుర్రాలు లాగేవి కనుక అప్పుడు వాయుకాలుష్యం ఉండేది కాదు. ఇప్పుడు మోటారుకార్లు, రాకెట్లు తయారవుతున్నాయి. శాస్త్రజ్ఞులు ఎంతో గర్వపడుతున్నారు. "ఇప్పుడు మేము గుర్రాలు అక్కరలేని వాహనాలను, రెక్కలు లేకుండానే ఎగురగలిగే పక్షులను కనిపెట్టాము" అని విర్రవీగుతున్నారు. విమానానికీ రాకెట్టుకూ కృత్రిమమైన రెక్కలను వారు కనుగొన్నప్పటికినీ వారు ఆత్మలేని దేహాన్ని కనిపెట్టలేదు. వారు ఆత్మలేని దేహాన్ని కనిపెట్ట గలిగినప్పుడు మాత్రమే వారిని గొప్పవారిగా భావించాలి. కాని అలాంటి ప్రయత్నం తప్పకుండా విఫలమవుతుంది. ఎందుచేతనంటే, నడిపించేవాడు లేకపోతే ఏ యంత్రమూ పనిచేయలేదని మనకు తెలుసు. ఎంతో కష్టమైన కంప్యూటర్లను నడిపించడానికి బాగా శిక్షణ పొందిన నిపుణులు కావాలి. అలాగే ఈ విశాల జగత్తనే గొప్ప యంత్రాన్ని పరమేశ్వరుడు నడిపిస్తున్నాడు. ఆ పరమేశ్వరుడు శ్రీకృష్ణుడు. ఈ భౌతిక జగత్తుకు మూలకారణం ఎవరనీ, ప్రధాన నియంత ఎవరనీ విజ్ఞానశాస్త్రవేత్తలు ఎన్నో పరిశోధనలను చేస్తూ

రకరకాల సిద్ధాంతాలను, ప్రతిపాదనలను చేస్తున్నారు. నిజానికి దీని తత్త్వం తెలుసుకోవడం ఎంతో తేలిక. అలా తెలుసుకొనే మార్గం పరిపూర్ణమైంది. ఈ విషయాన్ని పరిపూర్ణవ్యక్తి అయినా శ్రీకృష్ణుని నుంచే తెలుసుకోవలసి ఉంది. భగవద్గీత అందిస్తున్న జ్ఞానాన్ని మనం అంగీకరిస్తే, భౌతిక విశ్వయంత్రంలో మనం నివసిస్తున్న ఈ భూగోళం ఒక చిన్న భాగం అనీ, శ్రీకృష్ణుడనే చోదకుడు ఉండడం వలననే అత్యాశ్చర్యకంగా పనిచేస్తోందనీ మనకు వెంటనే బోధపడుతుంది.

మనం అనుసరిస్తున్న జ్ఞానమార్గం చాలా సులభమైనది. దేవాదిదేవుడు, ఆదిపురుషుడైన శ్రీకృష్ణుడు స్వయంగా భగవద్గీతను ఉపదేశించాడు. కనుక అది అతి ముఖ్యమైన జ్ఞానోపదేశక గ్రంథం. శ్రీకృష్ణుడు పూర్ణపురుషుడు, పురుషోత్తముడు. అతనిని మనం పురోషోత్తమునిగా అంగీకరిస్తున్నాము. కాని కొందరు ఆ మాటలను అంగీకరించడం లేదు. మనం అతనిని పురుషోత్తమునిగా అంగీకరిస్తున్నామంటే అది అతని పట్ల ఏదో ప్రత్యేకమైన అభిమానం వలన కాదు. అనేక ప్రమాణాల ఆధారంగా ఆ విషయాన్ని మనం గ్రహిస్తున్నాము. మన ఇష్టానిష్టాలను బట్టిగాని, ఏవో కొన్ని నమ్మకాలను బట్టి గాని మనం అలా భావించడం లేదు. సమస్త వైదిక సాహిత్యకర్త అయిన వ్యాసమహర్షి వంటి వేద తత్త్వవేత్తలు శ్రీకృష్ణుణ్ణి భగవంతునిగా అంగీకరించారు. విజ్ఞాన భాండాగారాలైన వేదాలు శ్రీకృష్ణుణ్ణి దేవాదిదేవుడుగా అంగీకరించాయి. వ్యాసదేవుడు అతని ఆధ్యాత్మిక గురువు నారద మహర్షి కూడా శ్రీకృష్ణుణ్ణి పురుషోత్తముడని అంగీకరించారు. నారద మహర్షికి ఆధ్యాత్మిక గురువైన బ్రహ్మ కూడా శ్రీకృష్ణుడిని పురుషోతముడే కాక పరమనియంత అని కూడ అంగీకరించారు : "ఈశ్వరః పరమః కృష్ణః" – "శ్రీకృష్ణుడే పరమ నియంత."

తాము ఎవరి నియంత్రణలోను లేమని చెప్పుకునేవారు ఈ సృష్టిలో ఎవరు ఉండరు. ఎంతటి ప్రముఖునికైనా శక్తిమంతునికైనా అతనిని నియంత్రించే పై అధికారి ఒకడు ఉండనే ఉంటాడు. అయితే, శ్రీకృష్ణుడిని మాత్రం అలా నియంత్రించేవాడు ఎవడూ లేడు. అందుచేతనే అతడు భగవంతుడు, అతడే అందరినీ నియంత్రించేవాడు. అతడిని మించిన పై అధికారి లేడు. అతనిని నియంత్రించే వాడు లేడు. సరిసమానుడు కూడా లేడు. సంపూర్ణ అధికార పదవిని కూడ అతనితో పంచుకునేవాడు ఎవడూ లేడు. ఈనాడు చాలామంది భగవంతుళ్ళమని పిలువబడేవారు ప్రచారంలో ఉన్నారు. కనుక పై వాక్యం వింతగా తోచవచ్చును. భారతదేశం నుంచి ప్రత్యేకంగా అమెరికాకు భగవంతుళ్ళు ఎగుమతి అవుతున్నారు. కనుక భగవానుళ్ళు చాలా చౌక అయిపోయారు. ఇతర దేశాలలో భగవంతుళ్ళు తయారుకారు కనుక ఆయాదేశాల ప్రజలు అదృష్టవంతులు. కాని, భారతదేశంలో అలా కాదు. ఇక్కడ ప్రతిరోజు భగవంతుళ్ళు తయారవు తున్నారు. లాస్ ఏంజెలస్‌కో, న్యూయార్క్‌కో భగవంతుడు వస్తున్నాడని అతనికి స్వాగతం ఇవ్వడానికి ప్రజలు తండోపతండాలుగా గుమికూడు తున్నారని తరచు మనం వార్తలను వింటున్నాము. కాని శ్రీకృష్ణుడు యోగ కర్మాగారంలో తయారయ్యే భగవంతుడు వంటి భగవంతుడు కాదు. అతడు ఎవరో తయారుచేసిన భగవంతుడు కాడు. స్వయంగా ఆయన దేవాదిదేవుడు.

ఈ మహత్తర భౌతిక ప్రకృతి వెనుక, ఈ విశాల విశ్వసృష్టి వెనుక భగవానుడైన శ్రీకృష్ణుడు ఉన్నాడనీ ప్రామాణిక వైదిక గ్రంథాలు ప్రకటిస్తున్నాయనీ మనం తెలుసుకోవాలి. ప్రామాణికమైన అధికారాన్ని అంగీకరించడం మనకు కొత్త అలవాటేమి కాదు! విద్య నేర్చుకోవాలంటే మనం ఉపాధ్యాయుని దగ్గరకో, పాఠశాలకో వెళ్ళుతాము. లేక తల్లితండ్రుల

వద్దనే నేర్చుకుంటాము. వారందరూ ప్రామాణికులు వారి వద్ద విద్య నేర్చుకోవడమనేది సహజం. చిన్నతనంలో మనం : "నాన్నా! ఇది ఏమిటి?" అని తండ్రిని ప్రశ్నిస్తాము. "ఇది కలము. ఇది కళ్ళజోడు, లేక ఇది బల్ల" అని ఆయన మనకు చెబుతాడు. ఆ విధంగా జీవితం ప్రారంభమైన నాటి నుంచీ బాలుడు తన తల్లిదండ్రుల నుంచి నేర్చుకుంటూ ఉంటాడు. బాలుడు తన తల్లిదండ్రులను ప్రశ్నిస్తూ వస్తువుల పేర్లను, వస్తువుల పరస్పర సంబంధాలను తెలుసుకొంటాడు. మంచి తల్లిదండ్రులు తమ పిల్లలు తమను దేనిని గురించి అయినా ప్రశ్నించినపుడు వారికి సరియైన సమాచారాన్నే అందిస్తారు. అదేవిధంగా, మనం ఒక ప్రామాణికుని నుంచి సంపాదించే ఆధ్యాత్మిక జ్ఞానం ఆ ప్రామాణికుడు వంచకుడు కాకపోతే అది సంపూర్ణ మవుతుంది. అలాకాకుండ, మనం స్వంతంగా మన ఊహాపోహలతో నిర్ణయాలను చేయడానికి ప్రయత్నిస్తే తప్పులు చేసే అవకాశం ఉంటుంది. మనం పరిచ్ఛిన్నులము(పరిమిత శక్తిగల వాళ్లము). మన అనుభవం కూడా పరిమితమైనదే కనుక కొన్ని సంఘటనల వలన కాని, కొన్ని ప్రత్యేక అనుభవాల వలన కాని, ఆరోహణ పద్ధతిలో కాని మనం చేసే సాధారణ నిర్ణయాలు ఎప్పటికి నిర్దుష్టం(పరిపూర్ణం) కాబోవు. అవి ఎప్పటికినీ దోషపూరితాలుగానే నిలచి ఉంటాయి.

పరమ ఆధారం శ్రీకృష్ణుడు. ఆయన ఉపదేశాలను గ్రహించి, వాటినే ఇతరులకు ఉపదేశించి నట్లయితే, మనం చెప్పేది కూడా పరిపూర్ణం మరియు ప్రామాణికం అవుతుంది. శ్రీకృష్ణుని నుంచి గాని, శ్రీకృష్ణుణ్ణి భగవంతునిగా అంగీకరించిన ప్రామాణికుని నుంచి గాని విని, విన్నది విన్నట్లుగా దానిని ఇతరులకు బోధించే పద్ధతిని గురు శిష్యపరంపరా పద్ధతి అంటారు. ఈ జ్ఞాన బోధవిధానాన్ని శ్రీకృష్ణుడు భగవద్గీత (4.2) లో పేర్కొన్నాడు :

ఏవం పరంపరాప్రాప్తమిమం రాజర్షయో విదుః

"ఈ దివ్యజ్ఞాన శాస్త్రం ఈ విధంగా గురుశిష్య పరంపర ద్వారా బోధించబడింది. రాజర్షులు దీనిని ఆ విధంగానే తెలుసుకొన్నారు."

పూర్వం ప్రామాణికులైన గొప్ప రాజర్షులు మాత్రమే జ్ఞానబోధను చేసేవారు. ఆ కాలంలో మహారాజులందరూ ఋషులై, మహాజ్ఞానులై, భక్తులై ఉండేవారు. వారు సామాన్య మానవులు కారు, కనుక వారి రాజ్యపాలన కూడా చక్కగా నడిచేది. వైదిక నాగరికతలో చాలామంది రాజులు దైవభక్తులై పరిపూర్ణత్వమును సాధించినట్లు అనేక ఉదాహరణ లున్నాయి. ఉదాహరణకు, ధ్రువమహారాజు భగవంతుణ్ణి అన్వేషించడానికి అరణ్యానికి వెళ్ళాడు. కఠినమైన నియమాలతో ఘోరమైన తపస్సు చేశాడు. ఆరు నెలల అతి స్వల్పకాలంలోనే భగవంతుణ్ణి సాక్షాత్కరింప చేసుకున్నాడు. అతడు కేవలం అయిదు సంవత్సరాల ప్రాయంగల రాజకుమారుడైనా, ఆధ్యాత్మిక గురువైన నారద మహాముని ఆదేశాలను ఖచ్చితంగా పాటించడం వలన విజయం సాధించగలిగాడు. ధ్రువమహారాజు మొదటినెలలో మూడురోజుల కొకసారి అడవిలో దొరికే కందమూల ఫలాలను తింటూ, ఆరు దినాలకు ఒకసారి నీళ్ళుత్రాగుతూ అడవిలో ఉండేవాడు. అతడు చివరకు ప్రాణాయామం చేస్తూ ఒంటికాలి మీద నిలబడి కొన్ని నెలలుపాటు తపస్సు చేశాడు. ఇలా ఆరునెలలు ఘోరతపస్సు చేసిన తరువాత భగవంతుడు అతనికి ప్రత్యక్షమయ్యాడు. మనం అంతటి తీవ్రతపస్సును చేయనవసరం లేదు; ప్రామాణికులైన గురువుల అడుగుజాడలలో నడిచినట్లయితే, భగవంతుడు మనకు సాక్షాత్కరిస్తాడు. భగవత్ సాక్షాత్కారమే మనిషి జీవితానికి పరిపూర్ణత్వమును చేకూరుస్తుంది.

కృష్ణ చైతన్యమార్గం తపస్సుపై ఆధార పడినప్పటికినీ, కష్టమైనదేమీ కాదు. ఆహారానికీ, సంభోగానికీ సంబంధించిన కొన్ని నిషేధాలున్నాయి.

(భగవంతునికి నివేదించిన ప్రసాదాన్ని మాత్రమే భుజించాలి. వైవాహిక జీవితానికి మాత్రమే సంభోగాన్ని పరిమితం చేయాలి.) ఆత్మ సాక్షాత్కారమునకు సహాయం చేస్తూ పరిపుష్టం చేసే మరికొన్ని నిబంధనలు కూడా ఉన్నాయి. ధ్రువమహారాజు లాగ తపస్సు చేయడం ఈ రోజులలో సాధ్యం కాదు. కాని కొన్ని వైదిక మూల సిద్ధాంతాలను అనుసరించడం వలన మనం ఆధ్యాత్మిక చైతన్యాన్ని, కృష్ణ చైతన్యాన్ని సాధించడంలో శీఘ్రపురోగతిని సాధించవచ్చును. మనం పురోగమించిన కొలది, క్రమముగా జ్ఞానం పరిపూర్ణం కాగలదు. మన మరుసటి జన్మ ఏమిటో చెప్పలేనప్పుడు మనం విజ్ఞాన శాస్త్రవేత్తలమో, తత్త్వవేత్తలమో అయినందు వలన ప్రయోజనం ఏమిటి? కృష్ణ చైతన్యసాక్షాత్కారమును పొందిన ఏ శిష్యుడైనను తన మరుసటి జన్మ ఏమిటో, భగవంతుడంటే ఏమిటో, జీవి అంటే ఏమిటో, జీవాత్మకూ భగవంతునికీ మధ్యగల సంబంధం ఏమిటో అతి సులభంగా వివరించగలడు. సంపూర్ణ జ్ఞానభాండాగారాలైన భగవద్గీత, శ్రీమద్భాగవతం వంటి పరిపూర్ణ గ్రంథాల నుంచి అతడు జ్ఞానాన్ని ఆర్జిస్తాడు కనుక అతని జ్ఞానం పరిపూర్ణమైంది.

ఇదే కృష్ణ చైతన్యమార్గం! దీనిని ఆచరించడం చాలా తేలిక. ప్రతిఒక్కరూ దీనిని ఆచరించి తమ జీవితాన్ని పరిపూర్ణం చేసుకోవచ్చును. ఒకవేళ ఎవరైనా నేను విద్యావంతుడను కాను, గ్రంథాలను పఠించలేను అని అంటే అతడు ఈ మార్గాన్ని అనుసరించడానికి అర్హుడుకాడని భావించనక్కర లేదు. అతడు : "హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే / హరే రామ హరే రామ రామ రామ హరే హరే" అనే మహామంత్రాన్ని జపించి పరిపూర్ణుడు కావచ్చును. శ్రీకృష్ణుడు మనకు జిహ్వను, చెవులను అనుగ్రహించాడు. వీటి ద్వారానే మనం శ్రీకృష్ణుని సాక్షాత్కరించు కోవచ్చునని, నేత్రాల ద్వారా కాదని తెలిసినప్పుడు మనం ఆశ్చర్యపోవచ్చును.

శ్రీకృష్ణుని ఉపదేశాలను వినడం ద్వారా మనం జిహ్వను నిగ్రహించడం నేర్చుకుంటాము. నాలుకను నిగ్రహించడం వస్తే మిగిలిన ఇంద్రియాల నిగ్రహం కూడా సాధ్యమవుతుంది. అన్ని ఇంద్రియాలలోనూ జిహ్వేంద్రియమే చాలా శక్తివంతమైనది, నిగ్రహించలేనిది అని అందరికీ తెలుసును. కాని దానిని 'హరే కృష్ణ' మహామంత్ర కీర్తన ద్వారాను, శ్రీకృష్ణునికి నివేదించిన ప్రసాదాన్ని భుజించడం ద్వారాను నిగ్రహించ వచ్చును.

మనం ఇంద్రియాల ద్వారాను, ఊహాపోహల ద్వారాను శ్రీకృష్ణుణ్ణి అవగాహన చేసుకోలేము. అది అసాధ్యం. శ్రీకృష్ణుడు మన ఇంద్రియ జ్ఞానానికి అతీతుడు. అత్యున్నతమైనవాడు కనుక ఇంద్రియాల ద్వారా ఆయనను అర్థం చేసుకోలేము. శరణాగతి ద్వారానే ఆయన మనకు అర్థం కాగలడు. అందుకే శ్రీకృష్ణుడు ఈ శరణాగతి విధానాన్ని ఉపదేశించాడు :

*సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ*
*అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః*

"సర్వవిధములైన ధర్మములను విడిచి కేవలము నన్నే శరణు పొందుము. నేను సమస్త పాపఫలితముల నుండి నిన్ను విడిపింతును, భయము నొందకుము." (భ.గీ. 18.66)

దురదృష్టవశాత్తు, తిరుగుబాటు చేయడం అనే జాడ్యం మనలో ఉండడం వలన మనం అప్రయత్నంగానే అధికారాన్ని ఎదిరిస్తాము. మనమీద ఎవరి అధికారాన్ని కాదన్నా, ప్రకృతి బలవంతంగా మన మీద తన అధికారాన్ని సాగిస్తుంది. దాని అధికారాన్ని తలదాల్చక తప్పదు. తన మీద ఎవరికీ అధికారం లేదనుకుంటూ గ్రుడ్డిగా తన ఇంద్రియాలకు దాసుడై జీవించే హీనమైన స్థితికన్నను బాధపడవలసిన విషయం ఇంకేమి

కలదు? మనం స్వతంత్రులమని చెప్పుకోవడం కేవలం అవివేకం. మనమందరం ఒకరి అధికారం క్రింద ఉన్నాము. అయినను మాకు ఎవరి ఆధిపత్యం వద్దు అంటూ ఉంటాము. ఇదే భ్రాంతి అంటే, 'మాయ' అంటే. ఏది ఏమైనా మనకు పరిమితమైన స్వాతంత్ర్యం కలదు. మనం మన ఇంద్రియాల అధికారంలో ఉండాలా, శ్రీకృష్ణుని అధికారంలో ఉండాలా అనే అంశమును మనం నిర్ణయించు కోవచ్చును. అయితే శ్రీకృష్ణుడు మనకు శాశ్వత శ్రేయోభిలాషి. ఏది ఉపదేశించినా మన శ్రేయస్సు కోరి ఆయన ఉపదేశిస్తాడు. కనుక శ్రీకృష్ణుడే ఉత్తమాధికారి. మనం శ్రీకృష్ణుని అధికారాన్ని ఎందుకు అంగీకరించ కూడదు? అలా అంగీకరించి కేవలం భగవద్గీత, శ్రీమద్భాగవతం నుంచి శ్రీకృష్ణుని దివ్య మహిమలను గురించి వినడం ద్వారా, 'హరే కృష్ణ' అనే అతని దివ్యనామాన్ని కీర్తించడం ద్వారా మన జీవితాలను కొద్దికాలంలోనే పరిపూర్ణం చేసుకోగలము.

14

# 2. భౌతిక మాయ నుంచి విముక్తి

మనం ఇప్పుడు చర్చిస్తున్న విషయం ఎంతో ఆనంద దాయకమైనది, అది అతి పవిత్రమైన భగవన్నామ సంకీర్తనం. ఎన్నో పాపాలు చేసి పతితుడైన ఒక బ్రాహ్మణుడు కేవలం కృష్ణనామ స్మరణ చేసినందువల్ల ఉదరింపబడ్డాడని పరీక్షిన్మహారాజుకు శుకదేవ గోస్వామి వివరించాడు. వ్యాసదేవుడు రచించిన కృష్ణలీలలను, కృష్ణ చైతన్యతత్త్వాన్నీ వర్ణించే విషయం శ్రీమద్భాగవతం ఆరవ స్కంధంలో వర్ణితమైంది.

శ్రీమద్భాగవతంలోని పంచమ స్కంధంలో, బ్రహ్మాండోత్పత్తి క్రమమును గురించి సంపూర్ణంగా వివరించబడింది. ఈ బ్రహ్మాండంలో అధోలోకం, మధ్యలోకం, ఊర్ధ్వలోకం అంటూ మూడు లోకాలున్నాయి. నిజానికి భాగవతంలోనే కాక ఇతర మతగ్రంథాలలో కూడా నరకలోకం, లేక అధోలోకం, స్వర్గలోకం లేక ఊర్ధ్వలోకం వర్ణించబడ్డాయి. ఈ లోకాలు, ఎక్కడ ఉన్నాయి? భూలోకానికి ఎంత దూరంలో ఉన్నాయి? అనే విషయం గురించి కూడా. ఖగోళశాస్త్రజ్ఞులు భూమికి చంద్రమండలానికి ఇతర గ్రహాలకు గల దూరాన్ని లెక్కలు కట్టినట్లే శ్రీమద్భాగవతం కూడా ఖచ్చితంగా ప్రామాణికంగా తెలుపుతుంది. అలాగే శ్రీమద్భాగవతం వివిధ లోకాల స్థితిని కూడా వర్ణిస్తుంది.

ఈ భూలోకంలో మనం రకరకాల శీతోష్ణ పరిస్థితులను అనుభవిస్తున్నాము. సమశీతోష్ణదేశాలైన అమెరికా సంయుక్త రాష్ట్రాల శీతోష్ణ పరిస్థితి, భారతదేశం లాంటి ఉష్ణదేశపు శీతోష్ణ పరిస్థితి వేర్వేరుగా ఉంటాయి. ఈ భూలోకంలో వాతావరణ భేదాలు ఉన్నట్లే పూర్తిగా భిన్నమైన

వాతావరణం గల ఇతర లోకాలున్నాయి. అలాంటి లోకాలను గురించి శుకదేవ గోస్వామి తెలిపినప్పుడు పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు :

అధునేహ మహాభాగ యథైవ నరకాన్నరః
నానోగ్రయాతనాన్నేయాత్తన్మే వ్యాఖ్యాతుమర్హసి

"మహాభాగా! మహాయాతనలను అనుభవింప వలసి యుండెడి నరకములలో మానవులెట్లు పడకుందురో ఆ ఉపాయమును దయయుంచి ఇప్పుడు వివరింపుడు." (భాగ. 6.1.6)

పరీక్షిన్మహారాజు వైష్ణవుడు. వైష్ణవులెప్పుడూ ఇతరుల కష్టాలను చూచి జాలి పడుతుంటారు. ఉదాహరణకు, ఆనాడు అవతరించిన యేసు క్రీస్తు ప్రజల దుర్భరస్థితిని చూచి ఎంతో బాధపడెను. ఏ దేశానికి చెందినవారైనా, ఏ తెగకు చెందినవారైనా భగవత్ చైతన్యం లేదా కృష్ణ చైతన్యమును అలవరచుకున్న వైష్ణవులు భక్తులందరూ కరుణాంతరంగులై ఉంటారు. అందుచేత భగవంతుని మహిమలను ప్రచారం చేసే భక్తులను దూషించడం గొప్ప అపరాధం!

శుద్ధవైష్ణవుని చరణకమలాలకు అపరాధం జరుగుతూ ఉంటే శ్రీకృష్ణభగవానుడు ఎన్నటికీ క్షమించడు. కాని వైష్ణవుడు కరుణా సముద్రుడు కనుక ఇతరుల అపరాధాలను క్షమించడానికి ఎప్పుడు సిద్ధంగా ఉంటాడు. 'కృపాంబుధి' : వైష్ణవుడు కరుణాసముద్రుడు. అతడు 'వాంఛాకల్పతరు': ప్రతిఒక్కరికీ ఏవో కోరికలుంటాయి. అలాంటి సకల కోరికలను వైష్ణవుడు తీర్చగలడు. 'కల్పతరు' అంటే ఆధ్యాత్మికలోకంలో ఉన్న కోరికలు తీర్చే కల్పవృక్షం. ఈ భౌతిక జగత్తులో ఏ జాతివృక్షం ఆ జాతిపండునే ఇస్తుంది. కాని కృష్ణలోకంలోనూ ఆధ్యాత్మికాకాశంలోని ఇతర లోకాలలోను వృక్షాలన్నీ కల్పవృక్షములే. కనుక అవి ఏవి కోరితే దానినే ఇవ్వగలవని

'బ్రహ్మ సంహిత' వర్ణించింది(చింతామణి ప్రకరసద్మసు కల్పవృక్ష). శుద్ధ వైష్ణవుడు శ్రద్ధగల శిష్యునికి కృష్ణచైతన్యం అనే సాటిలేని అద్వితీయ వరాన్ని ప్రసాదించగలడు. అందుచేత వైష్ణవుడు కల్పవృక్షంతో పోల్చబడ్డాడు.

వైష్ణవుణ్ణి 'మహాభాగ' అని సంబోధిస్తారు; అంటే అదృష్టవంతుడు అని అర్థం. వైష్ణవుడైన వ్యక్తి భగవత్ చైతన్యం కలవాడవడం చేత గొప్ప భాగ్యశాలిగా భావించబడుతాడు. ఈ బ్రహ్మాండంలోని వివిధ లోకాలలోని జీవులు వివిధ జాతులలో జన్మిస్తూ, మరణిస్తూ పరిభ్రమిస్తూ ఉంటారని, ఈ యుగంలో కృష్ణ చైతన్యాన్ని విస్తృతంగా ప్రచారం చేసిన శ్రీ చైతన్య మహాప్రభువు ప్రవచించార్ను. జీవులు తాము చేసే కర్మల ననుసరించి కావాలంటే స్వర్గానికి లేదా నరకానికి వెడతారు. ఎన్నో స్వర్గలోకాలు, ఎన్నో నరక లోకాలు, ఎన్నో రకాల జీవజాతులున్నాయి. 84 లక్షల జీవజాతు లున్నాయని 'పద్మ పురాణం' పేర్కొన్నది. జీవి ప్రస్తుత జీవితంలో గల మానసిక స్థితిని బట్టి తరువాత జన్మను పొందుతాడు. 84 లక్షల జీవరాశులలో ఏదో ఒకదానిలో పుడుతూ, గిడుతూ పరిభ్రమిస్తూ ఉంటాడు. "ఏ విత్తు నాటితే ఆ పండు" అన్న సూక్తి ఈ విషయంలో చక్కగా అన్వయిస్తుంది. ఈ భౌతిక జగత్తులో చావు పుట్టుకల మధ్య పరిభ్రమిస్తున్న అసంఖ్యాక జీవరాసులలో కృష్ణ చైతన్యాన్ని అలవరచుకోగల అదృష్టవంతుడు ఏ ఒక్కడో ఉంటాడని శ్రీ చైతన్య మహాప్రభువు తెలిపారు. కృష్ణ చైతన్యం ప్రతిచోట సులభంగానే లభిస్తున్నప్పటికినీ, ముఖ్యంగా ఈ కలియుగంలో దానిని అందరు స్వీకరించడం లేదు. కనుకనే కలియుగంలోని ప్రజలు దురదృష్టవంతులని శ్రీమద్భాగవతం పేర్కొన్నది. అందుచేత కేవలం అదృష్టవంతులు మాత్రమే ఈ కృష్ణ చైతన్యాన్ని అలవరచుకొని సచ్చిదానంద మయమైన జీవితాన్ని గడుపగలరని శ్రీ చైతన్య మహాప్రభువు తెలిపారు.

ఇంటింటికీ వెళ్ళి అభాగ్యులైన మనుష్యులను అదృష్టవంతులుగా

మార్చడమే వైష్ణవుని కర్తవ్యం. "నరక జీవితంలో మ్రగ్గిపోతున్న మనుష్యులకు ఏ విధంగా విముక్తి కలిగించాలి?" అను విషయం గురించే వైష్ణవుడు ఎల్లప్పుడు ఆలోచిస్తూ ఉంటాడు. ఇలాంటి ప్రశ్ననే పరీక్షిన్మహారాజు కూడా శుకదేవ గోస్వామిని అడిగాడు : "ప్రభూ! మనిషి తాను చేసే పాపాల వల్ల నరకయాతనలు పొందుతాడని, లేక నరకలోకాన్ని చేరుకుంటాడని తమరు సెలవిచ్చారు కదా! అటువంటి మనిషిని ఉద్ధరించే మార్గాలేమిటి ?" ఇది ప్రధానమైన ప్రశ్న. వైష్ణవుడు అవతరించినప్పుడు, భగవంతుడు స్వయంగా అవతరించడం, లేక భగవంతుని పుత్రులుగా కాని భగవంతుని అంతరంగిక భక్తులుగా కాని అవతరించడం, నరకయాతనలు పడుతున్న పాపాత్ములను ఉద్ధరించడం కోసమే! పతితులను విముక్తులను చేసే మార్గం వారికి తెలుసు. భక్తప్రహ్లాదుడు నృసింహభగవానుని దర్శించినపుడు (భాగ. 7.9.43) లో ఈ విధంగా అన్నాడు :

నైవోద్విజే పర దురత్యయవైతరణ్యా –
స్త్వద్వీర్యగాయనమహామృతమగ్నచిత్తః
శోచే తతో విముఖచేతస ఇన్ద్రియార్థ –
మాయాసుఖాయ భరముద్వహతో విమూఢాన్

"నా ప్రియమైన ప్రభూ! నా విముక్తి కోసం నేను ఆతురత చెందడం లేదు" అని విన్నవించుకున్నాడు. ఈ సందర్భంలో తమ వ్యక్తిగత విముక్తి కోసం చేసే ప్రయత్నాలకు ఎలాంటి అడ్డంకులు రాకుండ అత్యంత జాగరూకులై ఉండే మాయావాది వేదాంతుల వైఖరికీ, ప్రహ్లాదుని వైఖరికీ గల తేడాను మనం గుర్తించవచ్చును. తాము ఇతరులకు బోధిస్తూ, వారితో సాంగత్యం చేస్తే తాము కూడా పతితులై పోవచ్చుననీ, తమ ఆత్మజ్ఞానం నశించిపోతుందనీ మాయావాదులు భావిస్తారు. అందుచేతనే వారు

ఇతరులకు బోధించడానికి ముందుకు రారు. కాని వైష్ణవులు అలా కాదు, తాము పతితుల మవుతామేమోననే భయం ఉన్నప్పటికినీ ఇతరులకు బోధించడానికి ధైర్యంగా ముందుకు వస్తారు. కాని వారు పతితులు కారు. బద్ధజీవులను విముక్తులను చేయడంలో తాము నరకానికి పోవటానికి కూడా వైష్ణవుడు సిద్ధపడతాడు. ఇది కూడా ప్రహ్లాదుడు చెప్పినమాటే! అతడు ఇంకా ఇలా అన్నాడు : "భౌతిక ప్రపంచంలో జీవించుటకు నాకు ఎలాంటి చింత లేదు. ఎందుకంటే, ఏదో ఒకవిధంగా నేను ఎల్లప్పుడు కృష్ణ చైతన్యం కలిగి ఉండేలా శిక్షణను పొందాను కనుక నా గురించి నాకు చింత లేదు." ప్రహ్లాదుడు కృష్ణ చైతన్యం గలవాడు కనుక మరుసటి జన్మలో తానుతప్పక శ్రీకృష్ణుని సాన్నిధ్యం పొంద బోతున్నాననే విశ్వాసం అతనికి కలదు. కృష్ణ చైతన్య మార్గాన్ని శ్రద్ధతో నియమబద్ధంగా అనుసరించేవాడు మరుజన్మలో నిస్సందేహంగా పరమ గమ్యాన్ని పొందుతాడని భగవద్గీత వివరిస్తుంది. ప్రహ్లాదుడు ఇంకా ఇలా కొనసాగించెను : "నాకు ఆందోళన కలిగించే ఒకే ఒక విషయం. కృష్ణ చైతన్యరహితుల విషయంలో నేను ఎంతగానో ఆందోళన చెందుతున్నాను. నా విషయంలో నాకు ఎలాంటి చింతలేదు. వారిని గురించే నేను చింతిస్తున్నాను." మనుష్యులు ఎందుకు కృష్ణ చైతన్యవంతులు కావడం లేదు? "మాయాసుఖాయ భరముద్వహతో విమూఢాన్" – ఆ దుర్మార్గులు తాత్కాలిక సుఖం కోసం మిథ్యా నాగరకతను సృష్టించారు.

'మాయా సుఖాయ' అనేది నగ్నసత్యం. మనం మిథ్యా నాగరికతను సృష్టించడంలో సఫలీకృతుల మయ్యాము. ప్రతి సంవత్సరం మనం అనేక మోటారుకార్లను తయారు చేస్తున్నాము. వాటిని నడిపించడానికి రహదారులను వేస్తున్నాము. పాడైపోయిన రహదారులను బాగు చేస్తున్నాము. ఇవన్నీ కూడ సమస్యలపై సమస్యలను సృష్టిస్తున్నాయి.

కనుక 'మాయా సుఖాయ' అన్నది నిజం. అంటే సుఖం భ్రాంతి యుతమైనదని అర్థం. మనం సుఖం కోసం ఏదో ఒక మార్గం వెదకడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాము. అయితే ఆ ప్రయత్నం ఇతర సమస్యలను సృష్టించడానికి దారి తీస్తూంది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ప్రపంచంలో మరెక్కడా లేనన్ని మోటారు కార్లున్నాయి. అంతమాత్రం చేత అక్కడ సమస్యలు పరిష్కారమవడం లేదు. కొన్ని జీవిత సమస్యలను పరిష్కరించు కోవడానికి మనం కార్లను నిర్మిస్తున్నాము. కాని అది ఇతర సమస్యల సృష్టికి కారణమవుతూ ఉండడం మనం చూస్తున్నాము. కార్లను తయారు చేసుకుంటున్నాము. కనుక మనం మన మిత్రులను కలుసు కోవడానికో, వైద్యుణ్ణి సంప్రదించడానికో 30, 40 మైళ్ళ దూరం ప్రయాణం చేయవలసి వస్తుంది. మనం విమానంలో న్యూయార్క్ నుంచి బోస్టన్‌కు ఒక గంటలో పోగలము. కాని, విమానాశ్రయానికీ వెళ్ళడానికి కొన్ని గంటల సమయం పడుతుంది. ఈ పరిస్థితినే 'మాయా సుఖాయ' అని అంటున్నాము. 'మాయా' అంటే లేనిది, అసత్యమైనది, భ్రమ! మనం అత్యంత సుఖకరమైన పరిస్థితులను సృష్టించు కోవడానికి ప్రయత్నిస్తాము. కాని సుఖంలేని పరిస్థితిని మాత్రమే మనం సృష్టించు కుంటున్నాము. భౌతిక జగత్తు స్వభావమే అలా ఉంటుంది. భగవంతుడు ప్రకృతి ప్రసాదించిన సహజ సౌకర్యాలతో మనం తృప్తిపడలేక కృత్రిమ సౌకర్యాలను కల్పించు కున్నట్లయితే, వాటితో పాటు కొన్ని అసౌకర్యాలను కూడా కల్పించుకోక తప్పదు. ఎంతోమంది ఈ విషయాన్ని గ్రహించలేక ఎన్నో నూతన సౌకర్యాలను సృష్టించు కుంటున్నామను కుంటారు. ఆ సదుపాయాల సహాయంతో కేవలం పొట్టకూటి కోసం 50 మైళ్ళదూరంలో కల తమ కార్యాలయానికి వెళ్ళి తిరిగి 50 మైళ్ళు ప్రయాణం చేసి ఇంటికి చేరుకుంటున్నారు.

ఇటువంటి పరిస్థితులను గమనించే ప్రహ్లాదుడు భౌతిక దృష్టిగల ఈ విమూఢులు తాత్కాలిక సుఖాల కోసం అనవసరంగా లేనిపోని కష్టాల బరువును తమ నెత్తికెత్తుకుంటారని చెప్పాడు. "విమూఢాన్, మాయా సుఖాయ భరముద్వహతః" అందుచేతనే భౌతిక జీవితబంధం నుంచి విముక్తులై సన్న్యసించి ఎలాంటి చింతలు లేకుండా భగవంతునికి భక్తియుక్త సేవను చేయాలని వైదిక నాగరికత ఉపదేశిస్తుంది.

అయితే, అందరూ సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించవలసిన అవసరం ఎల్లప్పుడు లేదు. గృహస్థాశ్రమంలో ఉంటూనే కృష్ణ చైతన్యమార్గాన్ని అనుసరించ వచ్చునని కూడ అది నిర్దేశించింది. శ్రీల భక్తివినోద ఠాకూర్ గృహస్థులై మేజిస్ట్రేట్ పదవిని నిర్వహిస్తూనే భక్తియుక్త భగవత్ సేవను ఎంతో గొప్పగా నిర్వహించారు. ధ్రువుడు ప్రహ్లాదుడు కూడా గృహస్థులే! కాని తమ గృహస్థ ధర్మనిర్వహణం వలన భక్తియుక్త భగవత్ సేవకు ఎలాంటి ఆటంకం కలగకుండా మంచి శిక్షణను వారు పొందారు. అందుచేతనే, నిరంతరం కృష్ణ చైతన్యంలో నిమగ్నుడై ఉండే విద్యను తాను నేర్చుకున్నానని ప్రహ్లాదుడు తెలిపాడు. ఆ విద్య స్వరూపం ఏమిటి? "త్వద్వీర్య *గాయనమహామృతమగ్నచిత్తః*" భగవంతుని పరాక్రమ కృత్యాలను లీలలనూ ప్రస్తుతించడమే ఆ విద్య. 'వీర్య' అనే మాటకు పరాక్రమము అని అర్థం. శ్రీమద్భాగవతాన్ని పఠిస్తే శ్రీకృష్ణుని యొక్క లీలలు, శ్రీకృష్ణుని కీర్తి, శ్రీకృష్ణుని సహచరులు, ఆయనకు సంబంధించిన సర్వము పరాక్రమ పూరితమే, వీర్యవంతమే అని తెలుసుకో గలుగుతాము. ఈ సందర్భంలో ప్రహ్లాదుడు ఇలా తెలిపాడు : "నేను ఎక్కడకు వెళ్ళినా నీ పరాక్రమ కృత్యాలను మహిమలను కీర్తిస్తూ ఉంటే నేను రక్షించబడుతానని దృఢంగా విశ్వసిస్తున్నాను. నేను పతితుడనయ్యే ప్రశ్నేలేదు. ఒక రకమైన నాగరికతను కల్పించుకుని దానిలోనే పడి కొట్టు మిట్టాడుతూ నిరంతరం శ్రమించి

పనిచేసే వారిని గురించే నేను ఆందోళన చెందుతూ వారిని గురించే ఆలోచిస్తూన్నాను." ప్రహ్లాదుడు (భాగ. 7. 9. 44) లో ఇలా చెబుతున్నాడు :

ప్రాయేణ దేవ మునయః స్వవిముక్తికామాః
మౌనం చరన్తి విజనే న పరార్థనిష్ఠాః
నైతాన్ విహాయ కృపణాన్ విముముక్ష ఏకో
నాన్యం త్వదస్య శరణం భ్రమతోఽనుపశ్యే

"ఓ నృసింహదేవా! పలువురు సాధు పురుషులున్నను వారు కేవలము తమ ఉద్ధారము నందే అభిరుచిని కలిగియున్నట్లు నేను గాంచితిని. నగరములను, పట్టణములను పట్టించుకొనక వారు హిమాలయములకో, అరణ్యమునకో వెడలి మౌనవ్రతముతో ధ్యానమాచరింతురు. పరులను ఉద్ధరించుటలో వారికి అభిరుచి లేదు. కాని నాకు సంబంధించినంత వరకు ఈ దీనులగు మూర్ఖులను, మూఢులను వదలి నేనొక్కడనే ముక్తి నొందగోరను. భక్తిభావనారహితముగా, నీ పాదపద్మాశ్రయము లేకుండ ఎవ్వడును సుఖవంతుడు కాజాలడని నేనెరుగుదును. కనుక వారందరిని నీ చరణ కమలాశ్రయమునకు చేర్చవలెననియే నేను కోరుచున్నాను."

వారు నిరంతరం శ్రమించడం బాగానే ఉంది. కాని వారు దేనికోసం అలా శ్రమిస్తున్నారో వారికే తెలియదు. వారికి తెలిసినదెల్ల కామవాంఛ ఒక్కటే! దానిని తీర్చే వ్యభిచార గృహాలు మాత్రమే! అటువంటి పతితులను గురించి ప్రహ్లాదుడు : "నైతాన్ విహాయ కృపణాన్ విముముక్ష ఏకః"– "ప్రభూ! ఈ మూఢులను వదలిపెట్టి, నేను ఒక్కడనే మోక్షాన్ని పొందాలను కోను. నాతోపాటు ఈ మూఢులను తీసుకొని వెళ్ళకుండా నేను ఎక్కడికి వెళ్ళను" అని జాలి పడుతున్నాడు. పతితులైన జీవులను తనతో తీసుకొని వెళ్ళకుండా భగవంతుని రాజ్యంలో అడుగుపెట్టడానికి అతడు

నిరాకరించాడు. కాబట్టి అతడే నిజమైన వైష్ణవుడు. "నాన్యం త్వదస్య శరణం భ్రమతోఽనుపాస్యే" - "నిన్ను శరణుపొందే విధానాన్ని వారికి ఉపదేశించాలని మాత్రమే అనుకుంటున్నాను. అంతే. అదే నా లక్ష్యం" అన్నాడు.

శరణాగతుడు కాగానే మోక్షమార్గం సుగమం అవుతుందని వైష్ణవునికి తెలుసును కనుకనే ప్రహ్లాదుడు శరణాగతిని గురించి ఆ విధంగా నొక్కి చెప్పాడు.

నైవోద్విజే పర దురత్యయవైతరణ్యా -
స్త్వద్వీర్యగాయనమహామృతమగ్నచిత్తః

"ఏ విధంగానైనా శ్రీకృష్ణుని ముందు వారందరూ తలవంచి తీరుదురు గాక!" ఇది చాలా సులభమైన మార్గం. "నా ప్రభువైన కృష్ణా! ఎంతో కాలంగా, ఎన్నో జన్మలుగా నిన్ను మరచిపోయాను. ఇప్పుడు నాకు నీ స్మృతి లభించింది. నన్ను స్వీకరించు" అని శ్రీకృష్ణుని ముందు విశ్వాసంతో పలికితే చాలు. ఈ విషయం తెలుసుకొని చిత్తశుద్ధితో దేవాదిదేవుణ్ణి శరణువేడితే వెంటనే వారికి మార్గం తెరవబడుతుంది. నిజమైన వైష్ణవుని లక్ష్యం ఇదే!

పతితులైన బద్ధజీవులను ఉద్ధరించడం ఎలా అనే విషయాన్నే వైష్ణవుడు ఆలోచిస్తూ, నిరంతరం దానికోసం పథకాలు పన్నడంలో నిమగ్నుడై ఉంటాడు. శ్రీ చైతన్య మహాప్రభువు యొక్క ప్రధాన శిష్యులైన గోస్వాములు అలాంటి వైష్ణవులు. వారిని శ్రీనివాసాచార్యులు ఇలా వర్ణించారు :

నానాశాస్త్రవిచారణైకనిపుణౌ సద్ధర్మసంస్థాపకౌ
లోకానాం హితకారిణౌ త్రిభువనే మాన్యౌ శరణ్యాకరౌ

రాధాకృష్ణపదారవిందభజనానందేన మత్తాలికౌ
వన్దే రూపసనాతనౌ రఘుయుగౌ శ్రీజీవగోపాలకౌ

"శ్రీ సనాతన గోస్వామి, శ్రీ రూప గోస్వామి, శ్రీ రఘునాథభట్ట గోస్వామి, శ్రీ రఘునాథదాస గోస్వామి, శ్రీ జీవ గోస్వామి, శ్రీ గోపాలభట్ట గోస్వామి అను ఆరుగురు గోస్వాములకును నేను భక్తితో ప్రణమిల్లుచున్నాను. మానవజాతి కంతటికిని ఉపయోగపడు శాశ్వత ధర్మ నియమములను స్థాపించు ఉద్దేశముతో వేదవాఙ్మయమును మథించుటలో వారు అత్యంత నిపుణులు. మూడు లోకములలోను వారు సువిశ్రుతులు. గోపికా భావనతో శ్రీశ్రీ రాధాకృష్ణుల నర్చించుటలో వారు నిరంతరము నిమగ్నులైనందు వలన వారి నాశ్రయించుట సర్వ శ్రేయస్కరము."

అటువంటి వైష్ణవ సహజమైన దయతోనే, పరీక్షిన్మహారాజు శుకదేవ గోస్వామిని ఇలా ప్రశ్నించాడు : "అనేక రకాలైన నరక జీవితాలను గురించి మీరు వివరించారు. అయితే అటువంటి బాధామయ జీవితము నుంచి విముక్తి పొందడం ఎలాగో తెలియజేయండి. దయచేసి దానిని గురించి వివరించండి." "అధునేహ మాహాభాగ! యథైవ నరకాన్నరః నానోగ్రయోతనాన్నేయాత్ తన్మే." 'నరః' అనే మాట మనిషిని లేక పతితుణ్ణి సూచిస్తుంది. "నరకాన్నరః నానోగ్రయాతనాన్నేయాత్తన్మే" – "వారిని అతి ఘోరమైన నరకబాధల నుంచి, భయంకర దీనావస్థ నుంచి విముక్తులను చేయడం ఎలాగ?" అని అడుగుతున్నాడు. ఇదే వైష్ణవుని ప్రత్యేకత. "ఏదో కారణంగా వారందరు నరక జీవితంలో పడ్డారు. అంతమాత్రాన వారు అలా ఆ పరిస్థితిలోనే ఎప్పటికీ ఉండిపోవాలనే నియమం ఏమీ లేదు. వారికి విముక్తి కలిగించే మార్గం ఏదో ఉండే ఉంటుంది. ఆ మార్గాన్ని తెలపండి" అని పరీక్షిన్మహారాజు కోరాడు.

దానికి శుకదేవ గోస్వామి ఈ విధంగా సమాధానం తెలిపారు :

న చేదిహైవాపచితిం యథాంహసః
కృతస్య కుర్యాన్మనఉక్తపాణిభిః
ధ్రువం స వై ప్రేత్య నరకానుపైతి
యే కీర్తితా మే భవతస్తిగ్మయాతనాః

"రాజా! ఈ జన్మమున మనస్సు, వాక్కు, దేహములతో కావించిన పాపములకు ఎవ్వడు మరణమునకు పూర్వమే మనుసంహిత వంటి ధర్మశాస్త్రముల ననుసరించి ప్రాయశ్చిత్తమును చేసుకొనడో, అతడు నేను వివరించిన రీతిగా మరణానంతరము తప్పక నరకమున పడి తీవ్ర యాతనల ననుభవింపవలసి వచ్చును." (భాగ. 6. 1. 7)

అది ఎలా సాధ్యమవుతుంది? పాపకృత్యాలు చేయడానికి అనేక మార్గాలున్నాయి. వాటిలో ఒకటి మానసికం. ఒక వ్యక్తి ఏదో పాపకృత్యం చేయాలని ఆలోచిస్తాడు, "ఇతనిని నేను చంపాలి" అని ఒక పథకం పన్నుతాడు. అలా పథకం పన్నడం కూడా పాపకార్యంగానే పరిగణించ బడుతుంది. ముందుగా మనస్సు ఆలోచిస్తుంది; అనుభూతి చెందుతుంది; సంకల్పిస్తుంది. తరువాత దానిని క్రియారూపంలోకి మారుస్తుంది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని కొన్ని ప్రాంతాలలో, ఎవరి పెంపుడు కుక్కయినా దారిని పోయేవారిని చూచి మొరిగితే న్యాయశాస్త్రం ప్రకారం దాని యజమాని శిక్షార్హుడు. నిజానికి కుక్క మొరగడం ఎంతో సహజం; కాని దానికి దాని యజమాని బాధ్యుడవుతున్నాడు. కుక్క జంతువు కనుక అది బాధ్యత వహించదు. దానిని ఎంతో మక్కువతో పెంచి తన స్నేహితునిగా చేసుకున్నందుకు; దాని యజమాని చట్టప్రకారం బాధ్యుడవుతాడు. తన త్రోవనతాను పోయే మనిషిని చూచి కుక్క మొరగడం ఎలాగ చట్టవిరుద్ధంగా భావించ బడుతుందో, అదేవిధంగా ఇతరులకు కష్టం కలిగించేటట్లు మాట్లాడడం కూడా కుక్క మొరగడం వంటిదే కనుక అది పాపకృత్యమే.

విషయ మేమిటంటే, అనేక విధాలుగా పాపకార్యాలు, పాపపు ఆలోచనలను లేదా పాపపు మాటలను మాట్లాడవచ్చును లేదా నిజంగా పాపకార్యమును చేయవచ్చును. ఏమైనా అవన్నీ పాపకృత్యాలు గానే లెక్కించ బడుతున్నాయి. "ధ్రువం స వై ప్రేత్య నరకాన్ ఉపైతి" – అటువంటి పాపకార్యాలకు శిక్ష అనుభవించక తప్పదు.

ఈ చీకాకులనూ, శిక్షలనూ తప్పించుకో వచ్చుననే ఉద్దేశంతోనే ప్రజలు పునర్జన్మలను నమ్మము అంటాము. కాని ఎవరూ పునర్జన్మలను తప్పించుకోలేరు. మనం చట్టప్రకారం ప్రవర్తించకపోతే శిక్షించ బడుతామన్న సంగతి అందరికీ తెలిసిన సత్యమే. ఎవరైనా ఘోరకృత్యాలు చేస్తే వారిని ప్రభుత్వం శిక్షిస్తుంది. అయితే ఒక్కోసారి ఘోరకృత్యాలు చేసినవాడు కూడా శిక్షనుంచి తప్పించుకో గలుగుతాడు. కాని భగవంతుని చట్టం నుంచి తప్పించుకోవడం సాధ్యం కాదు. ఏ వ్యక్తి అయినా ఇతరులను వంచింప వచ్చును. దొంగతనం చేసినా ఇతరుల కళ్ళుకప్పి దాక్కుని ప్రభుత్వపు శిక్షను తప్పించు కోగలడు. కాని అత్యున్నత శాసనమైన ప్రకృతి శాసనం నుంచి మాత్రం అతడు తప్పించుకోలేడు. గొప్ప గొప్ప సాక్షులు చాలామంది ఉండడం వలన తప్పించుకోవడం చాలా కష్టం. పట్టపగలు అంటే సూర్యుడొక సాక్షి, వెన్నెల అంటే(రాత్రిపూట) చంద్రుడొక సాక్షి. సర్వవ్యాపి అయిన శ్రీకృష్ణుడు ఒక గొప్ప సాక్షి. కాబట్టి : "నేను చేస్తున్న పాపాన్ని ఎవరూ చూడడం లేదు" అని ఎవరూ చెప్పలేరు. ప్రతివారి హృదయం లోనూ అధిష్ఠించి ఉన్న శ్రీకృష్ణుడే ఒక గొప్పసాక్షి. అతడు జీవుల దైహిక మానసిక కార్యాలను చూస్తూ ఉండడమే గాక, వారు తలచుకునే కార్యాలను నేరవేర్చడానకి అవసరమయ్యే సౌకర్యాలను కూడా కలిగిస్తూంటాడు. తమ కోరికలను తీర్చుకోవడానికి వారు ఏమైనా చేయదలచుకుంటే శ్రీకృష్ణుడు వారికి అన్ని సదుపాయాలను కల్పిస్తాడు. "సర్వస్య చాహం హృది సన్నివిష్టః"–

"నేను అందరి హృదయాలలోనూ అధిష్టించి ఉన్నాను" అని భగవద్గీత (15.15)లో తెలుపబడింది. "మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనం చ" - "నా నుంచే జ్ఞాపకశక్తి, జ్ఞానం, విస్మృతి కలుగుతున్నాయి."

ఆ విధంగా శ్రీకృష్ణుడు మనకు ఒక అవకాశం కల్పిస్తాడు. మనం శ్రీకృష్ణుడిగా మారాలనుకుంటే, తనను పొందడానికి కూడ అవకాశం ఇస్తాడు; మనకు శ్రీకృష్ణుడు అవసరం లేదనుకుంటే అతడు తనను మరచి పోవడానికి అవకాశం కల్పిస్తాడు. శ్రీకృష్ణుణ్ణి, భగవంతుడిని మరచిపోయి భోగవిలాసాలతో జీవితం గడపాలనుకుంటే తనను మరచి పోవడానికి వీలు కల్పిస్తాడు. దానిని నిర్ణయించేది కూడా మనమే. కృష్ణ చైతన్యం ప్రసక్తి లేకుండానే మనం సుఖంగా ఉండగలమని అనుకుంటే దానికి కూడా శ్రీకృష్ణుడు అడ్డురాడు. "యథేచ్ఛసి తథా కురు." శ్రీకృష్ణుడు అర్జునునికి గీతోపదేశం చేసిన తరువాత : "నేను ఇప్పుడు ప్రతిదానిని గురించి నీకు వివరంగా చెప్పాను. నీ ఇష్ట ప్రకారం నడుచుకొనుము" అన్నాడు. అర్జునుడు వెంటనే: "కరిష్యే వచనం తవ" - "మీరు తెలిపిన ఆదేశమును పాటిస్తాను" అని సమాధానం చెప్పాడు. అదే కృష్ణ చైతన్యం అంటే.

మనకు గల స్వల్ప స్వాతంత్ర్యానికి భగవంతు డెప్పుడూ అడ్డురాడు. మనం భగవంతుని ఆదేశాలను అనుసరించి నడుచు కొన్నట్లయితే అతడు మనకు అన్నివిధాలా తోడ్పడుతాడు. ఎవరైనా చివరకు పతితులైనా, "ఇప్పటి నుంచి నేను కృష్ణ చైతన్యంతో శ్రీకృష్ణుని ఆదేశాలను పాటిస్తాను" అని నిర్ణయించుకుంటే శ్రీకృష్ణుడు వారికి సహాయం చేస్తాడు. ఎవరైనా అన్ని విధాలా పతితులైనను, వారిని కూడ క్షమించి మరికొంత జ్ఞానం కలిగిస్తాడు. "ఇక మీదట ఈ తప్పు చేయకు. నీ విధిని నీవు నిర్వర్తించు" అని వారికి ఉపదేశిస్తాడు. అలాకాక ఎవరైనా శ్రీకృష్ణుని మరచి పోవాలనుకుంటే, శ్రీకృష్ణుని అవసరం లేకుండానే సుఖంగా జీవించాలనుకుంటే దేవాదిదేవుడు

వారికి జన్మజన్మలకూ తనను(శ్రీకృష్ణుణ్ణి) మరచి పోయేందుకు అనేకమైన అవకాశాలను కలిపిస్తాడు.

"భగవంతుడు లేడనీ ఇకపై ఉండబోడనీ నేను చేసే కర్మలకు నేను బాధ్యుడను కాననీ అనడం వలన పరిస్థితి ఏమీ మారదు" అని పరీక్షిన్మహారాజు తెలిపాడు. నాస్తికులు తాము చేసే పాపకార్యాలతో తృప్తిపడుతూ భగవంతుడు లేడని అంటూ ఉంటారు. అయితే భగవంతుడు ఉన్నాడని అంగీకరిస్తే మాత్రం తమ పాపాలకు శిక్షను అనుభవించ వలసి వస్తుందన్న భయంతో వణికిపోతారు. అందుచేతనే తమను తాము వంచించుకుంటూ భగవంతుని ఉనికినే నిరాకరిస్తారు. కుందేళ్ళు తమను పెద్ద క్రూరమృగాలు ముట్టడించినప్పుడు గట్టిగా కళ్ళు మూసికొని, "నేను చంపబడను" అని అనుకుంటాయి. కాని అవి వాటి బారిని పడతాయి. అలాగే, మనం భగవంతుణ్ణి అతని శాసనాలనూ అంగీకరించక పోయినా, భగవంతుడు అతని శాసనాలు ఉండనే ఉంటాయి. ఉన్నత న్యాయస్థానంలో ఎంత గొప్పవాడైనా ప్రభుత్వ శాసనాలను లెక్కచేయనంటే కుదరదు. బలవంతంగానైనా ప్రభుత్వ శాసనాలను వారు ఒప్పుకోవలసి వస్తుంది. ప్రభుత్వ శాసనాలను తిరస్కరించేవారు శిక్షించబడతారు, చెరసాలలో పడుతారు. ఆ విధంగానే, ఎవరైనా బుద్ధిహీనులై భగవంతుని అస్తిత్వాన్ని రకరకాల సాకులతో "భగవంతుడు లేడు"; లేదా "నేనే భగవంతుణ్ణి" తిరస్కరించినప్పటికినీ వారు చేసే పాపపుణ్యాల ఫలితాలను అనుభవించక తప్పదు.

కర్మసిద్ధాంతాన్ని అనుసరించి కాని, మన కార్యకలాపాలను నియంత్రించే నియమాలను అనుసరించి కాని, మనం చక్కగా ప్రవర్తించి పుణ్యకార్యాలను ఆచరించినట్లయితే, మంచి అదృష్టాన్ని పొందుతాము; అలాకాక పాపాలు చేస్తే కష్టాలను అనుభవించవలసి వస్తుంది. అందుచేతనే శుకదేవ గోస్వామి ఇలా తెలుపుతున్నారు :

తస్మాత్పురైవాశ్విహ పాపనిష్కృతౌ
యతేత మృత్యోరవిపద్యతాత్మనా
దోషస్య దృష్ట్వా గురులాఘవం యథా
భిషక్ చికిత్సేత రుజాం నిదానవిత్

"కనుక మరణము ఆసన్నమగుటకు పూర్వమే, దేహసామర్థ్యము ఉన్నపుడే మానవుడు శాస్త్రానుసారము శీఘ్రముగా ప్రాయశ్చిత్త విధిని చేపట్టవలెను. లేనిచో అతని సమయము గడచిపోవును, పాపఫలము వృద్ధియగును. వైద్యుడు రోగ నిర్ధారణము చేసి, రోగ తీవ్రతను బట్టి చికిత్స చేయు రీతి మానవుడు తన పాపతీవ్రత ననుసరించి ప్రాయశ్చిత్త కర్మలను చేపట్ట వలెను." (భాగ. 6. 1. 8)

వ్యాధిపీడితులు వైద్యులను సలహా అడిగేటట్లు, మనుషుల పాపకార్యాలకు ప్రాయశ్చిత్త విధులను నిర్ణయించడానికి సంప్రదించ వలసిన బ్రాహ్మణులున్నారు. వైదిక జీవిత విధానంలో పాపాలకు ప్రాయశ్చిత్తాలు కూడా రకరకాలుగా ఉన్నాయి. పాపం చేసినవాడు దానిని పోగొట్టు కోవడానికి తపస్సు చేయడం ఒక ప్రాయశ్చిత్త విధానం. క్రైస్తవ మత గ్రంథమైన బైబిలులో కూడా ఈ విషయానికి సంబంధించిన అనేక దృష్టాంతాలున్నాయి. పాపం చేసినవాడు దానిని పోగొట్టు కోవడానికీ, ఆ పాపతీవ్రతను అనుసరించి తగిన ప్రాయశ్చిత్తం చేసుకోవాలని శుకదేవుడు కూడా సూచిస్తున్నాడు. వైద్యుడు రోగతీవ్రతను బట్టి ఖరీదైన మందును కాని చౌకమందును కాని వాడమని చెప్పవచ్చును. తలనొప్పికి సాధారణమైన ఆస్పిరిన్‌ను వాడమని చెప్పవచ్చును, లేదా తీవ్రమైన వ్యాధి వచ్చినపుడు వేలాది రూపాయలు ఖర్చు అయ్యే శస్త్రచికిత్సను సూచించవచ్చును. అలాగే, పాపకృత్యాలు కూడా వ్యాధుల వంటివే కనుక ఆరోగ్యవంతు డవుటకు శాస్త్రోక్తమైన ప్రాయశ్చిత్త చికిత్సను పొందవలసిందే.

జనన మరణములను అంగీకరించడం జీవాత్మకు వ్యాధిగ్రస్త పరిస్థితి లాంటిది. నిజానికి ఆత్మకు జనన మరణ వ్యాధులు లేవు. ఆత్మ బ్రహ్మము. కనుక భగవద్గీత (2.20) లో శ్రీకృష్ణభగవానుడు ఆత్మ పుట్టదని(*న జాయతే*) గిట్టదని(*న మ్రియతే*) చెబుతున్నాడు :

నా జాయతే మ్రియతే వా కదాచిన్
నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్యః శాశ్వతోఽ యం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే

"ఆత్మకెప్పుడును జననము కాని, మరణము కాని లేదు. ఆత్మ ఒకప్పుడుండి మరియొకప్పుడు లేకపోదు. అది అజము(పుట్టుక లేనిది), నిత్యము, శాశ్వతము, పురాతనము. దేహము చంపబడినను అది చంపబడదు."

ఆధునిక నాగరకతలోని ప్రజలకు మరణించిన తరువాత ఏమి జరుగుతుందో తెలియజేసే విద్యావిధానం చాలా అవసరం. నిజానికి నేటి విద్యావిధానం బహు లోపభూయిష్టంగా ఉంది. మనిషికి మరణానంతరం ఏం జరుగుతుందో తెలియదు; కనుక వట్టి పశువులాగ మరణిస్తున్నాడు, పశువుకు తానుతప్పక మరణించాలని కాని, మరొక జన్మ ఎత్తాలని కాని తెలియదు. మరి మనిషి అలా ఉండడానికి వీలు లేదు కదా! పశువుకంటే ఎక్కువ జ్ఞానం ఉండాలి. మనిషి కేవలం ఆహార నిద్రా భయ మైథునాలలోనే ఆసక్తుడై ఉండడం తగదు. తినడానికి కావలసినంత ఆహారం, నిద్రించడానికి మంచి భవనం, కామవాంఛ తీర్చుకోవడానికి తగిన ఏర్పాట్లు, క్షేమంగా ఉండడానికి తగిన రక్షణ సదుపాయాలు ఉన్నంత మాత్రాన అతడు మనిషి కాడు. అలాంటి వ్యవహారాలపైన ఆధారపడిన నాగరకత అతి నీచమైనది. పశువులకు

కూడా ఈ విషయాలలో ఆసక్తి ఉంటుంది. కనుక మనిషి అంతకు మించిన ఉన్నత స్థాయికి చెందిన జ్ఞానం పొందలేకపోతే, అతని జీవితానికీ పశు జీవితానికీ తేడా ఏమి ఉంటుంది?

"ఈ దుఃఖభూయిష్టమైన బంధంలో నేను ఎందుకు చిక్కుకు పోయాను? దీనికి ప్రతిక్రియ ఏదైనా ఉందా? శాశ్వత జీవితం అనేది ఏదైనా ఉందా? మరణం నాకు ఇష్టం లేదు; కష్టపడడం కూడా నాకు ఇష్టం లేదు. నేను చాలా సుఖంగా, ప్రశాంతంగా జీవించాలను కుంటున్నాను. దీనికి ఏదైనా అవకాశం ఉందా? దీనిని సాధించే విధానం కాని, విజ్ఞానశాస్త్రం కాని ఏదైనా ఉందా?" అనే జిజ్ఞాస కలిగినప్పుడే ఆ మనిషి పశువు కన్న ప్రత్యేకత కలవాడగును. ఇలాంటి ప్రశ్నలు మనలో రేకెత్తి, వాటికి సమాధానాల కోసం మనం ప్రయత్నించి నప్పుడు మాత్రమే మన మానవ నాగరికత సార్థకమవుతుంది. ఈ ప్రశ్నలు మనలో కలుగకపోతే, మన నాగరికత పాశవిక నాగరికత అన్నది స్పష్టం. పశువులు, పశుప్రాయులైన మనుష్యులు ఆహార నిద్రా భయ మైథునాల వల్ల తృప్తి పడతారు. నిజానికి ఈ విధానం అంతా ఏదో ఒకనాడు అంతరించి పోతుంది. క్రూరమైన మృత్యువు నుంచి ఏ ఒక్కరూ కూడా తమను తాము రక్షించుకోలేరు. కనుక నిజమైన రక్షణ మనకు లేనేలేదు. ఉదాహరణకు, హిరణ్యకశిపుడు శాశ్వతంగా జీవించడానికి ఘోరమైన తపస్సు చేశాడు. కాని భగవంతుడు నరసింహావతారం ధరించి అతనిని గోళ్ళతో చీల్చి చంపి అతని ప్రయత్నాన్ని భంగపరచాడు. విజ్ఞాన శాస్త్రాభివృద్ధి వల్ల భవిష్యత్తులో మరణాన్ని అరికట్టగలమని శాస్త్రజ్ఞులు గొప్పలు చెప్పు కుంటున్నారు. కాని అది కేవలం ఉన్మత్త ప్రలాపం లాంటిది. మరణాన్ని నివారించడం ఎవరికీ సాధ్యం కాదు. మనం విజ్ఞానశాస్త్రంలో గొప్ప ప్రగతిని సాధించి ఉండవచ్చును, కాని జన్మ మృత్యు జరా వ్యాధులనే

నాలుగు విధాలైన దుఃఖాలకు వైజ్ఞానిక పరిష్కారమంటూ ఏదీ లేదు.

వివేకవంతుడైన మానవునికీ జన్మ మృత్యు జరా వ్యాధులనే నాలుగు ప్రధాన సమస్యలనూ పరిష్కరించడానికి ఆసక్తి ఉండాలి. మరణించడానికి ఎవరూ ఇష్టపడరు; కాని మరణానికి చికిత్స లేదు. పుట్టిన ప్రతిజీవి గిట్టక తప్పదు. నానాటికీ పెరిగిపోతూన్న జనసంఖ్యను కృత్రిమ మార్గాల ద్వారా అరికట్టడానికి ప్రతివ్యక్తీ ఎంతగానో ప్రయత్నిస్తున్నాడు. అయినా జనం పుడుతూనే ఉన్నారు. అలాగే మరణాలు కూడా ఆగడం లేదు. వైద్యశాస్త్రం కొత్త కొత్త విషయాల నెన్నింటినో కనిపెట్టినప్పటికినీ, వ్యాధులనేవి ఆగడం లేదు. వృద్ధాప్యమూ తప్పడం లేదు.

ఎవరైనా తమ జీవితానికి సంబంధించిన సమస్యలను పరిష్కరించు కున్నామని అనుకోవచ్చును. కాని నిజమైన సమస్యలు జన్మ మృత్యు జరా వ్యాధులు. వీటికి పరిష్కారం లేదు కదా! వీటిని పరిష్కరించాలంటే కృష్ణ చైతన్యమే తగిన మార్గం. ప్రతిమనిషి తన దేహాన్ని ప్రతిక్షణం త్యజిస్తూనే ఉన్నాడు. ఈ దేహ త్యాగపు చివరిదశకు మరణం అని పేరు. శ్రీకృష్ణుడు ఇలా చెబుతున్నాడు :

జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున

"ఓ అర్జునా! నా జన్మము మరియు కర్మల దివ్యత్వము నెరిగినవాడు దేహమును విడిచిన పిమ్మట తిరిగి ఈ భౌతిక ప్రపంచమున జన్మింపక నా శాశ్వత ధామమునే పొందగలడు." (భ.గీ.4.9)

మరణానంతరం మనిషి ఏమవుతాడు? 'మామేతి' – అంటే అతడు తిరిగి శ్రీకృష్ణుని దగ్గరకు చేరిపోతాడు అని. శ్రీకృష్ణుని చేరాలని కోరుకుంటే కనుక మనం ఆధ్యాత్మిక దేహాన్ని సిద్ధం చేసుకోవాలి. అలా సిద్ధం చేసుకునే

పద్ధతియే ఈ కృష్ణ చైతన్యము. కృష్ణ చైతన్యంలో తననుతాను స్థిరపరచు కోగలిగినవాడు క్రమంగా తన మరుసటి దేహాన్ని - అంటే శ్రీకృష్ణుని నివాసమైన కృష్ణలోకానికి తనను వెంటనే చేర్చగల ఆధ్యాత్మిక దేహాన్ని సిద్ధపరచు కుంటాడు. తిరిగి భగవద్ధామమును చేరుకుని అక్కడ శాశ్వతమైన సుఖశాంతులతో జీవిస్తాడు.

K. Nagabhushana Rao 33
B. Com:
A. P. TRANS Co., Ltd:

# 3. కృష్ణభక్తిని అలవరచుకొనటం

పాపకల్మషముల తీవ్రతను బట్టి ప్రాయశ్చిత్తం అవసరమని వేదశాస్త్రాలు నిర్దేశిస్తున్నాయి. మరణించే ముందు అలా ప్రాయశ్చిత్తం చేసుకునేవాడు, పునర్జన్మలో పతితుడు కాకుండా ఉంటాడని శుకదేవ గోస్వామి చెబుతున్నాడు. ఒకవేళ ప్రాయశ్చిత్తమును చేసుకోకపోతే, ఆ పాపఫలితాలను భరిస్తూ అనేక బాధలను అనుభవించ వలసి ఉంటుంది. ఒక వ్యక్తి మరొకవ్యక్తిని హత్యచేస్తే ఆ హంతకుడు కూడా చట్టంవల్ల ప్రాణాలను కోల్పోతాడు. ప్రాణం తీసినందుకు అతని ప్రాణాన్ని కూడా తీయాలన్న భావం కొత్తదేమీ కాదు. మానవజాతి అంతటికీ ధర్మశాస్త్ర గ్రంథమైన 'మను సంహిత' లో ఇది కనిపిస్తుంది. హంతకుణ్ణి రాజు గారు ఉరితీయడం హంతకునికే శ్రేయస్కరమని, ఆ విధంగా అతనిని ఉరి తీయకపోతే అతడు ఆ హత్యవల్ల కలిగే విపరీత పరిణామాల వల్ల అనేక విధాలుగా బాధపడవలసి ఉంటుందని ఆ వైదిక ధర్మశాస్త్రం చెబుతూంది.

ప్రకృతి నియమాలు చాలా సూక్ష్మమైనవి ప్రజలకు వాటి గురించి తెలియక పోయినా వారికి అవి వర్తిస్తూ ఉంటాయి. 'మను సంహిత'లో ప్రాణం తీసినవాడి ప్రాణాలు తీయడమే సరియైన సిద్ధాంతం అని చెప్పబడింది. నిజానికి ప్రపంచమంతటా అదే ఆమోదించబడుతూ ఉంది. అదేవిధంగా ఇతర ధర్మసూత్రాలు కూడా చాలా ఉన్నాయి. వాటిని అనుసరించాలి. బాధ్యతారహితంగా ఎవ్వరూ చిన్నచీమను కూడా చంపకూడదు. ఏ ప్రాణినీ మనం సృష్టించ లేనప్పుడు చంపే హక్కు

కూడ మనకు లేదు. అందుచేత మనిషిని చంపడానికీ జంతువును చంపడానికీ తేడా ఉందన్న శాసనం మానవకల్పితం కనుక అది దోషరహితం కాదు. మానవకల్పితాలైన శాసనాలలో దోషాలుంటాయి. కాని భగవంతుని శాసనాలలో దోషాలుండవు. భగవంతుడు ప్రవచించిన ధర్మశాస్త్రాన్ని అనుసరించి జంతువును చంపడం కూడా మనిషిని చంపడం లాంటి శిక్షార్హమైన నేరమే. ఈ రెండింటికీ భేదం ఉందనేవారు తమ ధర్మశాస్త్రాలను తామే కల్పించుకున్నారని మనం గ్రహించాలి. క్రైస్తవుల మతగ్రంథం బైబిలులో ఇవ్వబడిన పదిశాసనాలలో ఒకటి "నీవు హత్య చేయరాదు" అన్నది. ఇది న్యాయమైన శాసనం. కాని తమంత తామే కొన్ని భేదాలను కల్పించి, ఊహించి "మనిషిని చంపరాదు, జంతువును చంపవచ్చును" అంటూ దానికి వక్రభాష్యం చెప్పుకున్నారు. ఈ విధంగా ప్రజలు తమనుతాము వంచించుకుంటూ, తమకు ఇతరులకు కూడా బాధలు కలిగిస్తూంటారు. ఏది ఏమైనను, భగవంతుని శాసనాలు ఇలాంటి ప్రవర్తనను క్షమించవు.

ప్రతిప్రాణీ, ఏ రూపంలో ఉన్నా, ఏ దేహం ధరించినా భగవంతుని సృష్టే. భగవంతుడు ప్రాణులందరికీ పరమపితగా భావించబడుతూ ఉన్నాడు. ఒక తండ్రికి చాలామంది సంతానం ఉండవచ్చును. వారిలో కొందరు తెలివిగలవారు, కొందరు తెలివి లేని వారు ఉండవచ్చును. తెలివి గలవాడు తండ్రి దగ్గరకు వచ్చి : "నా సోదరుడు బుద్ధిహీనుడు, అతనిని చంపుతాను" అని అంటే ఆ తండ్రి అంగీకరిస్తాడా ? ఒక కుమారుడు తెలివి లేని వాడు కనుక అతని బాధ్యతను వదిలించు కోవడానికి మిగిలిన కుమారులు అతనిని చంపివేస్తామంటే ఆ తండ్రి ఎప్పటికీ అంగీకరించడు. అలాగే పరమపిత అయిన భగవంతుడు కూడా తన సంతానమైన జంతువులను చంపుతామంటే ఒప్పుకుంటాడా? ఒప్పుకోడు, శిక్షిస్తాడు.

84 లక్షల జీవరాశులు తన సంతానమేనని భగవానుడు అర్జునునికి భగవద్గీతలో తెలిపాడు. "ఆ ప్రాణులకు నేను బీజప్రదాత అయిన తండ్రిని" అని భగవంతుడు పలికాడు. లోకంలో తండ్రి బీజప్రదాత అయితే, తల్లి ఆ బీజాన్ని తన రక్తంతో పెంచినట్లే, పరమపిత అంశభూతమైన ప్రాణికోటిని భౌతిక ప్రకృతి అనే తల్లి దగ్గర భగవంతుడే పెంచుతున్నాడు.

జీవాత్మ పరిమాణం చాలా సూక్ష్మమైనది; వేదశాస్త్రాలు దానిని "*కేశాగ్రశతభాగస్య శతాంశం*" అని వర్ణిస్తున్నాయి. అంటే తలవెంట్రుక చివరి భాగంలో పదివేలవ వంతు. ఈ పరిమాణాన్ని వేల భాగములుగా విభజింపబడుటను మనం ఊహించటం చాలా కష్టం. ఎంత శక్తిమంతమైన సూక్ష్మదర్శినితో కూడా మనం దానిని చూడలేము. కాబట్టి జీవకణ పరిమాణం చర్మచక్షువులకు కనిపించనంత సూక్ష్మమైనది. ఈ విషయం అంతా వేదశాస్త్రాలలో వివరించబడి ఉంది. కాని మనం తగినంత శక్తి లేకపోవడం వలన ఆత్మను చూడలేము. మనం ఈ భౌతిక నేత్రాలతో జీవాత్మ పరిమాణాన్ని చూడలేకపోయినా, అతడు ఈ దేహంలోనే ఉండి ఈ దేహాన్ని విడిచిపెట్టిన తరువాత తన కర్మను అనుసరించి మరొక దేహాన్ని స్వీకరిస్తాడు.

ఈ కర్మలన్నీ ఒక పై అధికారి పర్యవేక్షణ క్రింద మాత్రమే జరుగుతున్నాయని మనం ఎప్పుడు భావించాలి. ఒకజీవి ఈ భౌతిక ప్రపంచంలో ఒక కార్యాలయంలో పనిచేసే కార్యకర్తలాగ పనిచేస్తూంటాడు. అతని పనిచేసే తీరు గురించి 'సర్వీస్ రికార్డు'లో నమోదు చేయబడుతూ ఉంటుంది. అలాగే జీవాత్మకు తన పై అధికారి అభిప్రాయం ఏమిటో తెలిసే అవకాశం లేదు. కాని అతని 'సర్వీస్ రికార్డు' మాత్రం కార్యాలయంలో భద్రపరచ బడుతుంది. అతని కర్మలను అనుసరించి పై పదవికి పదవోన్నతి పొందడమో, వేతనం పెరగడమో, లేదా క్రింది

పదవికి తగ్గించి వేయడమో, లేదా అసలు ఉద్యోగం నుంచి తొలగించి వేయడమో జరుగు తూంటుంది. అలాగే, జీవి చేసే అన్ని పనులకు సాక్షులుంటారు. అందుచేతనే, జీవులందరూ ఒక పై అధికారి పర్యవేక్షణలో పనిచేస్తూన్నారనీ, వారి వారి కర్మలను బట్టి బహుమానాలో శిక్షలనో పొందుతారనీ వేదశాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ఇప్పుడు మనం మానవ జన్మ ఎత్తాము. కాని మరు జన్మలో ఇంతకన్న ఉత్తమజన్మనో అధమ జన్మనో ఎత్తవచ్చును. జీవి ఎలాంటి జన్మ ఎత్తాలి అన్న విషయాన్ని పై అధికారులే నిర్ణయిస్తారు. సాధారణంగా జీవునికి తాను ఒక దేహాన్ని విడిచి మరొక దేహంలో ఎలా ప్రవేశిస్తాడోనన్న దానిని గురించి జ్ఞానం లేదు.

జీవాత్మ దేహం మారుతున్న కొలది ఒక జీవిత కాలంలోనే దేహాంతరంలో ప్రవేశిస్తూంది. ఈ దేహం మొదట తల్లి గర్భంలో ఉన్నప్పుడు బఠాణీ గింజంత చిన్నదిగా ఉంటుంది. అది క్రమంగా అభివృద్ధి చెందిన కొలది రెండు కళ్ళు, రెండు చెవులు, రెండు ముక్కుపుటాలు, ఒక నోరు, ఒక పురీషద్వారం, ఒక ప్రజననాంగం – ఇలా నవద్వారాలు ఏర్పడుతాయి. ఆ విధంగా ఈ దేహం మాతృగర్భంలో ఎంతవరకు అభివృద్ధి పొందవలసి ఉందో అంతవరకు ఉంటుంది. శిశువుగా బయట పడవలసినంత అభివృద్ధి చెందిన తరువాత గర్భం నుంచి బయటపడి అభివృద్ధి చెందుతూంది. ఈ పెరుగుదల వల్ల దేహంలో మార్పు వస్తూ ఉంటుంది. ఈ మార్పును జీవి చూడలేడు గనుక అతనికి అవగాహన కాదు. పసితనంలో ఉన్న చిన్న దేహం పెద్దవాళ్ళమైన తరువాత ఉండదు; కనుక మన దేహాలు మారాయని అనగలము. ఆ విధంగానే, భౌతిక వస్తువుల సహజ ధర్మాన్ని అనుసరించి ఈ దేహం పనిచేయనప్పుడు(అంటే పనికిరాకుండా పోయినప్పుడు) దీని నుంచి మారవలసి ఉంటుంది. ప్రతి భౌతిక వస్తువు నాశనమవుతుంది.

చెడిపోయిన యంత్రంలాగ, చినిగిపోయిన వస్త్రంలాగ దేహం కూడ కొంతకాలమైన తరువాత నిరుపయోగం అవుతుంది.

ఈ దేహాభివృద్ధి ప్రక్రియ నిరంతరం జరుగుతూనే ఉన్నప్పటికినీ, ప్రగతి శీలమని భావించ బడుతున్న ఆధునిక విశ్వవిద్యాలయ విద్యావిధానం ఈ మార్పును గురించి బోధించక పోవడం ఎంతో దురదృష్టకరం. నిజానికి ఆధ్యాత్మిక జ్ఞాన శిక్షణ లేని విద్య విద్య కాబోదు. ఏ విద్యను అభ్యసించ కుండానే ఎవరైనా ఆహార నిద్రా భయ మైథునాలను నేర్చుకోగలరు. జంతువులు చదువుకోవు. ఏ సాంకేతిక విద్యను అభ్యసించవు. ఏ విశ్వ విద్యాలయంలోనూ ఉన్నత విద్యను గడించవు. కాని అవి ఆహారం తింటున్నాయి, నిద్రిస్తున్నాయి, మైథునం చేస్తున్నాయి, ఆత్మరక్షణం చేసుకోగలుగు తున్నాయి. వీటి గురించి మాత్రమే తెలిపే విద్యావిధానం విద్య అనిపించు కోదు. నిజమైన విద్య మనం ఎవరమో తెలుసుకొనేటట్లు చేస్తుంది. మానవుడు తన నిజమైన స్థితిని తెలుసుకొని కృష్ణ చైతన్యాన్ని అభివృద్ధి చేసుకోనంత వరకూ అతని కర్మలన్నీ అజ్ఞానంతో చేసినవే అవుతాయి. భౌతిక ప్రకృతి నియమాలను జయించడమే మానవ జీవితోద్దేశం. నిజానికి మనమందరం భౌతిక ప్రకృతి అడ్డంకులను ఎదుర్కొని విజయం సాధించడానికే ప్రయత్నిస్తున్నాము. జన్మ మృత్యు జరా వ్యాధులను నిర్మూలించడమే మన అంతిమ విజయం. కాని ముఖ్యమైన ఈ విషయాన్నే మనం నిర్లక్ష్యం చేస్తున్నాము.

మనకు భగవంతుడు ప్రసాదించిన వాటి ఉపయోగం గురించి తెలిపే విద్యావిధానమే ప్రగతిని కలిగిస్తుంది. సమస్త ప్రాణికోటికీ ఆహారాన్ని సమకూర్చుతున్న ఆ భగవంతుడే మనకు కూడా ఎన్నోరకాల పండ్లనూ ధాన్యాలనూ ప్రసాదిస్తూన్నాడు. "జీవో జీవస్య జీవనమ్" – "ఒక ప్రాణి మరొక ప్రాణికి ఆహారపదార్థం" అని శ్రీమద్భాగవతం (1.13.47) లో

కలదు. చేతులు లేని జంతువులు, చేతులు గల మనవంటి మానవులకు ఆహారం అవుతున్నాయి. కాళ్ళులేని జంతువులు నాలుగుకాళ్ళ జంతువులకు ఆహారం అవుతాయి. గడ్డి కూడా ప్రాణే, అయితే దానికి నడువడానికి కాళ్ళులేవు. కాబట్టి ఆవులు మొదలైన జంతువులకు ఆహారం అవుతూంది. స్థావరాలైన ప్రాణులు స్థానచలనం గల జంతువులకు ఆహారం అయి పోతున్నాయి. ఈ విధంగా ఇదే సూత్రం ప్రకారం భూలోకంలో గల స్వార్థపరులకూ, వారికి ఎర అవుతున్నవారికీ మధ్య నిరంతరం సంఘర్షణ జరుగుతూ ఉంటుంది. బలవంతుడు బలహీనుణ్ణి పీడిస్తున్నాడు. ఇది ప్రకృతి నియమం. కాని శాస్త్రానుసారంగా వైష్ణవులు లేదా కృష్ణభక్తులు మాంసం తినరు. ఇది కేవలం శాకాహారాన్ని పాటించడమే కాకుండా భగవత్ చైతన్యాన్ని పెంపొందించుటకు అని కూడా మనం చెప్పవచ్చును. భగవంతుని భక్తుల మవడానికి కొన్ని నియమములను పాటించాలి. ప్రతిజీవి ఆహారం తినక తప్పదు. కాని వైష్ణవునికి మాత్రం శ్రీకృష్ణునికి నివేదించిన ఆహారపదార్థాలను మాత్రమే తినాలనే నియమం కలదు. ఇది భగవద్గీత (9.26) సిద్ధాంతం కూడా. శ్రీకృష్ణుడిలా చెబుతున్నాడు :

*పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి*
*తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః*

"పత్రమునైనను, పుష్పమునైనను లేదా జలమునైనను ప్రేమతోను, భక్తితోను ఎవరేని అర్పించినచో నేను స్వీకరింతును."

దాని అర్థం శ్రీకృష్ణుడికి ఆకలి వేసి, మనలను భిక్ష అడుగుతున్నాడని కాదు. దేనినైనా భగవంతునికి సమర్పించ వచ్చునని దీని భావం. ఇది కేవలం ప్రేమ బాంధవ్యాన్ని కల్పించుకోవడమే. "నువ్వు నన్ను ప్రేమించు; నేను నిన్ను ప్రేమిస్తాను" అనే సంబంధాన్ని శ్రీకృష్ణుడు కోరుతున్నాడు.

ప్రతి వస్తువునూ భగవానుడైన శ్రీకృష్ణుని శక్తే సృష్టించి పోషిస్తూ ఉంది. అటువంటప్పుడు, శ్రీకృష్ణుడు ఒక ఆకునో, పండునో, కొంచెం నీటినో సమర్పించుమని మనలను అడుగవలసిన అవసరం ఏముంది? "కృష్ణా! నేను చాలా పేదవాడను, ఇంకేమీ సంపాదించ లేకపోయాను. ఈ పండును ఆకును మాత్రమే నీకు నివేదిస్తున్నాను. దయచేసి స్వీకరించు!" అని ప్రార్థిస్తూ ప్రేమతో ఒక పండు ముక్కనో, ఒక తులసి దళాన్నో, పవిత్ర ఉదకాన్నో సమర్పిస్తే శ్రీకృష్ణుడు చాలా సంతోషిస్తాడు. అటువంటి సమర్పణ అతనిని చాలా ఆనందింప చేస్తుంది. మనం నివేదించిన దానిని అతడు స్వీకరిస్తే, మనకు శ్రీకృష్ణునితో స్నేహం ఏర్పడుతుంది. కనుక మన జీవితం పరిపూర్ణమైనట్లే ప్రపంచంలో ఏ ప్రాంతంలోని వాడైనా, బీదవాడైనా, ధనికుడైనా, పండ్లను, పూవులను, జలాన్ని సంపాదించ గలడు. శాకాహారమే నివేదించాలను కోవడం కాని శ్రీకృష్ణునికి అవి అవసరమనడం కాని ముఖ్యం కాదు. శ్రీకృష్ణుని పట్ల భక్తిని కలిగి ఉండడం, సాధనను చేయడానికి ప్రయత్నించడమే దీనిలో ముఖ్యమైన విషయం.

ఇచ్చి పుచ్చుకోవడంతోనే ప్రేమ ప్రారంభం అవుతుంది. మనకు ఇష్టమైన వారికి మనం ఏదైనా ఇస్తాము; వారు మనకు ఏదైనా ఇస్తారు. ఈ విధంగా పరస్పరం ప్రేమ అభిమానములు పెరుగుతాయి. మనం ఏ అమ్మాయినో, అబ్బాయినో, పురుషుణ్ణో, స్త్రీనో ప్రేమిస్తే ఇచ్చి పుచ్చు కుంటాము. అలాగే శ్రీకృష్ణుడు కూడా ఇచ్చి పుచ్చుకోవడం ఎలాగో మనకు నేర్పుతున్నాడు. "నన్ను ప్రేమించడానికి ప్రయత్నించు. నన్ను ప్రేమించడం ఎలాగో నేర్చుకో, నాకేమైనను సమర్పించు" అని శ్రీకృష్ణుడు మనలను బ్రతిమాలు తున్నాడు.

"అయ్యా! నీకు సమర్పించ దగినదేదీ నా వద్ద లేదు" అని మనం అనవచ్చును.

అప్పుడు "మీరు ఒక పండు ముక్కనైన, ఒక తులసి దళాన్నైనా, కొంచెం జలమునైనా సంపాదించ లేరా?" అంటాడు.

"అంతేనా! దానినైతే ఎవరైనా సంపాదించగలరు."

ఇదే కృష్ణ చైతన్య విధానం. ఇది మనం శ్రీకృష్ణునితో స్నేహం పెంపొందించు కోవడానికి అవకాశం ఇస్తుంది. ఈ విధంగా మనం శ్రీకృష్ణునితో ఎన్నిరకాల సంబంధ బాంధవ్యాలనైనా పెట్టుకోవచ్చును. మనం శ్రీకృష్ణుని ప్రత్యక్ష సేవకులము కావచ్చును; అంతకన్న ఉన్నత స్థాయిలో శ్రీకృష్ణుని తండ్రిగానో, తల్లిగానో, ప్రియురాలుగానో కూడ ప్రేమించవచ్చును. శ్రీకృష్ణుడు సకల ప్రాణులతో ప్రేమ బాంధవ్యాన్ని స్థాపించు కోవడానికి ఎల్లప్పుడు సిద్ధంగా ఉంటాడు. నిజానికి అతడు మనకు పరమపిత మరియు మనమందరం అతని అంశభూతులము కనుక అతనితో సంబంధం మనకు ఇదివరకే కలదు. కుమారుడు తండ్రి దేహంలోని భాగం. కనుక తండ్రీతనయుల మధ్య ఉండే సంబంధం తెగిపోదు; కొంతకాలం మరుపున పడిపోవచ్చును. కాని తండ్రిని గుర్తించిన కుమారునికి కాని, కుమారుని గుర్తించిన తండ్రికి కాని వెంటనే ప్రేమ పెల్లుబుకుతుంది. అదేవిధంగా, మనకూ శ్రీకృష్ణునికీ శాశ్వతమైన సంబంధం కలదు. అయితే ప్రస్తుతం ఈ సంబంధం మరుగున పడింది. దాని ఫలితంగా మనకు శ్రీకృష్ణునితో సంబంధం లేదని భావిస్తున్నాము. కాని అది నిజం కాదు. మనం శ్రీకృష్ణునితో భిన్నమైన వాళ్ళము కాదు. కనుక శ్రీకృష్ణుని అంశలము కనుక శ్రీకృష్ణునికీ మనకు గల సంబంధం శాశ్వతం. మనం దానిని పునరుద్ధరించు కోవడం మాత్రమే ఇప్పుడు చేయవలసిన పని. అలా పునరుద్ధరించు కోవడమే ఈ కృష్ణ చైతన్య సాధన విధానం.

ప్రస్తుతం మనం రకరకాల చైతన్యాలలో కొట్టుకొని పోతున్నాము. ఒకడు భారతీయుడనని భావిస్తాడు. మరొకడు అమెరికా వాడి ననుకుంటాడు,

మరొకడు నేను ఇది అని నేను అది అని భావిస్తాడు. ఇలా మనం అనేక కృత్రిమ సంబంధాలను సృష్టించు కుంటున్నాము. మన నిజమైన గుర్తింపు ఏమిటి ? "నేను శ్రీకృష్ణునికి సంబంధించిన వాడను" అని తెలుసు కోవడమే. మనం ఈ విధంగా ఆలోచిస్తే కృష్ణ చైతన్యంతో ఆలోచించిన వాళ్ళ మవుతాము. అలా ఆలోచించడం వలన ప్రాణులందరిలో విశ్వప్రేమ నెలకొంటుంది. శ్రీకృష్ణుడు మనకు శాశ్వతపిత అవడం వలన అతడు మనకందరకును బంధువు. దాని ఫలితంగా మనం కృష్ణ చైతన్య సంబంధాన్ని ఏర్పరచుకున్నప్పుడు మనమందరం పరస్పర బంధువుల మవుతాము. ఒకడు ఒకరిని వివాహం ఆడితే అత్తింటివారి వైపు వారందరితోనూ దానంతట అదే బంధుత్వం ఏర్పడుతుంది. అదేవిధంగా మనం శ్రీకృష్ణునితో మనకు గల నిజమైన సంబంధాన్ని పునరుద్ధరించుకుంటే ప్రతివారితోనూ మనం నిజమైన సంబంధాన్ని నెలకొల్పుకో గలుగుతాము. అదే నిజమైన సకల జీవప్రేమకు ఆధారం అవుతుంది. విశ్వప్రేమ కృత్రిమమైనది. సమస్త జగత్తుకు కేంద్రమైన శ్రీకృష్ణునితో మన సంబంధం సుస్థిరం కాకపోతే కొనసాగలేదు. అమెరికాలో పుట్టినవాడు అమెరికన్ అవుతాడు. తక్కిన అమెరికనులు అతని పరివారమవుతారు. అతడు మరొక దేశంలో పుడితే అతనికి అమెరికనులతో సంబంధ బాంధవ్యాలుండవు. ఈ భౌతిక లోకంలో సంబంధ బాంధవ్యాలన్నీ తాత్కాలికమైనవి. కాని శ్రీకృష్ణునితో మనకు గల సంబంధం మాత్రం శాశ్వతమైనది. దేశకాలాలకు అతీతమైనది. మనం శ్రీకృష్ణునితో సంబంధాన్ని పునరుద్ధరించుకుంటే, విశ్వమానవ సౌభ్రాత్రం, న్యాయం, శాంతి, అభివృద్ధి ఏర్పడినట్లే. శ్రీకృష్ణుడు లేకపోతే ఈ ఉన్నత ఆదర్శాలు ఫలించడం సాధ్యం కాదు. కేంద్రబిందువే లేకపోతే సౌభ్రాత్రం, శాంతి ఎలా ఉండగలవు ?

భగవద్గీత (5.29) లో శాంతికి సంబంధించిన సూత్రం స్పష్టంగా

తెలుపబడింది. శ్రీకృష్ణుడొక్కడే అన్నింటికీ భోక్త అని మనం గ్రహించాలి (భోక్తారం యజ్ఞతపసామ్). సమస్త కర్మలకు శ్రీకృష్ణుడే కేంద్రబిందువైన కృష్ణ చైతన్య మందిరాలలో పైన ఉదాహరించబడిన జ్ఞానం వృద్ధి చెందుతుంది. ఈ మందిరాలలో వంటలు శ్రీకృష్ణుని కోసమే జరుగు తున్నాయి, వ్యక్తుల ప్రయోజనం కోసం కాదు. వంటకాలన్నీ శ్రీకృష్ణునికి నివేదించిన తరువాతనే భక్తులు వాటిని ప్రసాదంగా స్వీకరిస్తారు. అయితే వంటకం తయారవు తున్నప్పుడు అవి శ్రీకృష్ణభగవానుని కోసమే వండుతున్నామన్న భావం ఎంతో అవసరం. మందిరంలో ఉండే భక్తులు వీధులలోకి తమ పనికోసం వెళ్ళరు; శ్రీకృష్ణుడు సర్వత్ర ఉన్నాడన్న విషయం ప్రజలకు తెలియ జేయడానికి, కృష్ణ చైతన్య సాహిత్యాన్ని వితరణ చేస్తూ వారిని ప్రబోధించడానికే వెళ్తారు. ధనం మొత్తం శ్రీకృష్ణుని కోసం, అతని సందేశాన్ని అనేక విధాలుగా వ్యాపింప చేయడానికి ఖర్చు చేస్తున్నారు. సమస్తం కృష్ణార్పణంగా జరిగే అలాంటి జీవిత విధానం జీవులలో కృష్ణ చైతన్యాన్ని వృద్ధి సరుస్తుంది. మన కార్యకలాపాలు ఎప్పటిలాగే కొనసాగుతూ ఉండవచ్చును. కాని, అవి అన్నీ కేవలం మన స్వలాభం కోసం కాదనీ, శ్రీకృష్ణుని నిమిత్తమేననీ మనం గ్రహించాలి. ఆ విధంగా మనం మన నిజమైన చైతన్యాన్ని పొంది సుఖంగా ఉండవచ్చును. నిజమైన చైతన్యమైన కృష్ణ చైతన్యాన్ని తిరిగి పొందకపోతే మనం కొంతవరకు విషయ వ్యామోహితులమై పోవడం నిజం. కృష్ణ చైతన్యం లేనివారు తాత్కాలికం, క్షణికమైన భౌతిక వ్యామోహ స్థితిలో ఉంటారు. కనుక వారు ఉన్మాదులుగా భావించ బడుతున్నారు. మనం శాశ్వతమైన జీవాత్మలము గనుక తాత్కాలిక విషయాలను గురించి చింతించము. మనం శాశ్వతులము కనుక మన కర్తవ్యం కూడా శాశ్వతంగా ఉండాలి. శ్రీకృష్ణుణ్ణి ప్రేమతో సేవించడమే ఆ శాశ్వత కర్తవ్యం.

నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానామ్. శ్రీకృష్ణుడు శాశ్వతుడైన దేవాదిదేవుడు; మనం అతనికి శాశ్వతులమైన అనుచరులము. శ్రీకృష్ణుడు పరమాత్ముడు; మనం అతనికి పరతంత్ర జీవులము. మన చేతివ్రేలు మన దేహంలోని ఒక భాగం; దాని శాశ్వతమైన కర్తవ్యం మన దేహానికి సేవ చేయడమే. అదే దాని ప్రయోజనం. అది కనుక దేహానికి సేవ చేయకపోతే అది రోగగ్రస్తమో, నిరుపయోగమో అవుతుంది. అలాగే మనం శ్రీకృష్ణుని అంశభూతులము కనుక పరమపిత అయిన అతడు మన కోరికలన్నింటిని తీరుస్తాడు కనుక మనం అతనికి విధేయులమై సేవ చేయాలి. అటువంటి వినయపూర్వక సేవా జీవితమే సాధారణమైన, నిజమైన మోక్షము. అలాకాక శ్రీకృష్ణుణ్ణి నిరాకరించి, అతనితో ఎలాంటి సంబంధము లేని జీవితం గడుపడానికి ప్రయత్నించడం అంటే పాప జీవితమును గడుపుతున్నట్టు లెక్క.

ఇదే విషయం గురించి శుకదేవ గోస్వామీ, పరీక్షిన్మహారాజు చర్చించారు. బద్ధజీవులను నరక జీవితాల నుంచి విముక్తులను చేయడం ఎలాగ అని పరీక్షిన్మహారాజు ఎంతగానో పరితపించాడు. కష్టాలలో గల ప్రజలను ఉద్ధరించాలనే కోరిక వైష్ణవునికి అతి సహజం. సాధారణంగా ఇతరులు ప్రజల కష్టసుఖాలను గురించి ఏ మాత్రం పట్టించుకోరు. దేవాదిదేవుని భక్తుడైన వైష్ణవుడు పతితులను ఎట్లు ఉద్ధరించాలి అని నిరంతరం ఆలోచిస్తూ ఉంటాడు. యేసుక్రీస్తు ప్రపంచ ప్రజలను వారి పాపాల నుంచి విముక్తి కలిగించడానికి, వాటిని తాను స్వీకరించి సిలువపైన అనేక హింసలు అనుభవించాడని క్రైస్తవులు నమ్ముతున్నారు. ఇతరులను పాపాల నుంచి ఎలా విముక్తులను చేయాలన్న విషయం గురించే భగవద్భక్తులు నిరంతరం ఆలోచిస్తూ ఉంటారు. శ్రీ చైతన్య మహాప్రభువు శిష్యుడైన వాసుదేవ దత్తుడు కూడా అలాంటి భక్తుడే.

అతడు భగవానునితో : "మహాప్రభు! మీరు ఇప్పుడు అవతరించారు, కనుక ఈ భూమిపైన గల జీవులందరిని దయతో ఉద్ధరించి, ఆధ్యాత్మిక జగత్తు అయిన వైకుంఠమునకు తీసుకువెళ్ళండి. వారు మహాపాపులు కనుక విముక్తులు కాలేరని మీరు భావిస్తే వారి పాపాలన్నింటినీ దయచేసి నాకు సంక్రమింప చేయండి. నేను ఆ పాపాలను భరిస్తాను" అని అన్నాడు. అది అసలైన వైష్ణవుని దయార్ద్ర హృదయం. అయితే జీసస్ క్రీస్తు కాని, వాసుదేవ దత్తుడు కాని, మన పాపాలను గుత్తకు తీసుకుంటారు లెమ్మని మనం మన ఇష్టం వచ్చినట్లు పాపాలు చేస్తూ పోవచ్చునని అర్థం కాదు; అలాచేయడం చాలా ఘోరం. ఒక వైష్ణవుడు కాని భక్తుడు కాని పతితులైన మనుష లందరి కోసం కష్టపడవచ్చును. కాని మనుషులందరూ లేక ఒక భక్తుని శిష్యులు ఈ సదుపాయం ఉంది కదా అని పాపకార్యాలు చేస్తూ పోరాదు. యేసుక్రీస్తో, వాసుదేవ దత్తుడో తమ కోసం పరితపించారు గనుక తామింక పాపాలు చేయడం ఆపివేయాలని వారు గ్రహించాలి.

నిజానికి ప్రతివ్యక్తీ తన పాపకార్యాలకు తానే బాధ్యుడు. అందుచేత శుకదేవ గోస్వామి : "తస్మాత్ పురైవాశ్విహ పాపనిష్కృతౌ" - తానుచేసిన పాపకృత్యాలకు తన దేహం శిథిలం కాకముందే తగిన ప్రాయశ్చిత్తం చేసుకోవాలని తెలిపాడు. "యతేత మృత్యోరవిపద్యతాత్మనా దోషస్య దృష్ట్వా *గురులాఘవం యథా భిషక్ చికిత్సేత రుజాం నిదానవిత్*" - తాను చేసిన పాపకృత్యాల కనుగుణంగా ప్రాయశ్చిత్త కార్యక్రమాన్ని నిర్ణయించుకోవాలి. ఇంతకుముందు చెప్పినట్లు, రకరకాల పాపకృత్యాలకు రకరకాల ప్రాయశ్చిత్తాలున్నాయి. ఏమైనా మరణానికి ముందే తన పాపాలకు తగిన ప్రాయశ్చిత్తం చేసుకోకపోతే, ఈ పాపాలు మరుసటి జన్మకు కూడా సంక్రమిస్తాయి. తత్ఫలితంగా బాధపడవలసి ఉంటుంది. మనం మన పాపకృత్యాలకు తగిన ప్రాయశ్చిత్తం చేసుకోకపోతే ప్రకృతి మనలను

క్షమించదు. మన పాపాల ఫలితాలను మరుజన్మలో అనుభవించవలసి ఉంటుంది. భౌతికమైన ఈ బంధనాన్నే 'కర్మబంధనం' అని భగవద్గీత (3.9) లో అన్నారు.

*యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః*
*తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసంగః సమాచర*

"యజ్ఞరూపుడైన విష్ణువు కొరకే కర్మ నాచరింపవలయును. లేనిచో ఈ భౌతిక ప్రపంచమున కర్మ బంధకారకము కాగలదు. కావున ఓ, కుంతీపుత్రా! నీ విధ్యుక్త ధర్మములను విష్ణుని ప్రీత్యర్థమే కావింపుము. ఆ విధముగా నీవు బంధముల నుండి సదా విముక్తుడవై ఉండగలవు."

ఒకడు తన ఆహారం కోసం ఒక జంతువును చంపవచ్చును. కాని అతడు ఆ జీవహింసకు తగిన శిక్షను పొందుతాడు. అటువంటివాడు మరుసటి జన్మలో ఆవుగానో మేకగానో జన్మిస్తాడు. అతడు చంపిన ఆవో, మేకో మనిషిగా పుట్టి అతనిని తినివేస్తుంది. ఎవరు విశ్వసించినను, విశ్వసించక పోయినను ఇది వైదిక సూక్తి. దురదృష్టవశాత్తు నేటి విద్యావిధానం పునర్జన్మను ఎవ్వరూ నమ్మని విధంగా ఉంది. విద్యాధికులైన కొలది భగవంతుని పట్లనూ, భగవంతుని శాసనాల పట్లనూ, పునర్జన్మ పట్లనూ, పాపపుణ్యాల పట్లనూ నమ్మకం అంతకంతకు సన్నగిల్లి పోతూందని పిస్తూంది. ఈ విధంగా ఆధునిక విద్య మనుషులను కేవలం పశువులుగా మార్చి వేస్తూంది. తాను ఎవరో, తన దేహం తాను అవునో కాదో బోధించని విద్య విద్య కానేరదు, ఆ విద్యను అభ్యసించిన వాడు గాడిదకన్న ఎక్కువేమీ కాడు. గాడిద కూడా ఇతర జంతువల వలెనే "తన దేహమే తాను" అని భావిస్తుంది. మనిషి కూడా అదేవిధంగా భావిస్తే అతనికీ జంతువుకూ మధ్య భేదం ఏముంటుంది? ఈ విషయాన్ని శ్రీమద్భాగవతం చక్కగా వివరిస్తూ ఉంది :

యస్యాత్మబుద్ధిః కుణపే త్రిధాతుకే స్వధీః కళాత్రాదిషు భౌమ ఇజ్యధీః
యత్తీర్థబుద్ధిః స్సలిలే న కర్హిచిత్ జనేష్వభిజ్ఞేషు స ఏవ గోఖరః

"ఎవడు మూడు ధాతువులతో నిర్మించబడిన ఈ దేహాన్ని(దేహాన్ని, తానని భావిస్తూ భార్యాపుత్రులతో బంధువులతో బంధుత్వానికి కట్టుబడి, అతడు నివసిస్తున్న ప్రదేశము పూజనీయాలనీ, అక్కడి జలం పవిత్రమైనదనీ భావించి, అక్కడ ఉండే సాధువులను లెక్కచేయడో వాడు ఎద్దుగాను, గాడిదగాను పరిగణింప బడుతాడు." (భాగ. 10.84.13) ఆయుర్వేద శాస్త్రాన్ని అనుసరించి కఫము, వాత్తము, పిత్తములనే మూడు దోషాలతో దేహం నిర్మితమవుతుంది. మనం భుజించే ఆహారాన్ని ద్రవంగా మార్చే యంత్ర సముదాయం మన దేహంలో ఉంటుంది. ఇంకా మనకు తెలియని క్లిష్టమైన అనేక పరిణామాలు మన దేహంలో జరుగుతూ ఉంటాయి. మనం : "ఇది నా దేహం" అని చెప్పుకుంటాము కాని, ఈ దేహం గురించి మనకేమి తెలుసు? కొందరు : "నేను భగవంతుణ్ణి" అని చెప్పుకుంటారు. కాని వారికి తమ దేహంలో ఏం జరుగుతుందో తెలియదు.

ఈ దేహం మలమూత్రరక్త అస్థులు గల ఒక తిత్తి. వీటి నుంచే మనకు బుద్ధి కలుగుతుందని నమ్మేవాడు మూఢుడు. మనం మూత్ర రక్తాస్థికల మిశ్రమం వల్ల బుద్ధిని సృష్టించగలమా? అయినప్పటికినీ, మనుషులు "నేను ఈ దేహాన్ని" అని భావిస్తున్నారు. అందుకే తానే ఈ దేహమని నమ్ముతూ, భార్యాపుత్రులు, బంధువులతో సంబంధాలు సత్యమని భావించేవాడు మాయామోహితుడని వేదాలు చెబుతున్నాయి. 'కళత్రమ్' అంటే భార్య అనీ, 'ఆది' అనగా మొదలైన వారు అనీ అర్థం. మనిషి తాను ఒంటరినని భావించడం వలన ఒక స్త్రీని భార్యగా స్వీకరిస్తాడు; వెంటనే కుమారులు కలుగుతారు; తరువాత మనుమలు కలుగుతారు. ఆ విధంగా సంసారం విస్తరిస్తుంది. 'స్త్రీ' అనే పదానికి 'విస్తరించేది' అని అర్థం.

కాబట్టి 'కళత్రాదిషు' అంటే భార్యతో ప్రారంభించి 'తనను విస్తరింప చేసుకోవడం'. 'భౌమ' అనే పదం ఒకరి జన్మస్థలాన్ని సూచిస్తూ ఉంది. దానిని మూఢుడు పూజార్హంగా పరిగణిస్తాడు*(ఇజ్యధీః)*. మనుషులు తమ తమ జన్మభూమి కోసం ప్రాణాలర్పించడానికి కూడా సిద్ధపడుతారు. నిజానికి ఈ భూమి, దేహం, భార్య, పిల్లలు, దేశం, సమాజం – వీటితో తనకు ఎలాంటి సంబంధమూ లేదని వారికి తెలియదు. నేను బ్రహ్మమును *(అహం బ్రహ్మాస్మి)*. బ్రహ్మజ్ఞానాన్ని పొందడం అంటే దీనిని తెలుసు కోవడమే. మనం ఈ జ్ఞానాన్ని పొందినప్పుడు సుఖాన్ని పొందగలము.

*బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి*
*సమఃసర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్*

"ఈ విధముగా దివ్యస్థితి యందు ప్రతిష్ఠితుడైనవాడు శీఘ్రమే పరబ్రహ్మానుభవమును పొంది ఆనంద పూర్ణుడగును. దేని కొరకు శోకించక, దేనిని వాంఛింపక అట్టివాడు సర్వజీవుల యెడ సమత్వ భావమును కలిగియుండును. అటువంటి స్థితి యందే అతడు నా శుద్ధభక్తియుక్త సేవను పొందుచున్నాడు." (భ.గీ. 18.54) "నేను జీవాత్మను, బ్రహ్మాన్ని, నేను భౌతిక పదార్థాన్ని కాను" అని తెలుసుకో గలిగినవాడు, వెంటనే సంతోషమును పొందుతాడు*(ప్రసన్నాత్మా)*. ఈ సంతోషం యొక్క చిహ్నాలు ఆశపడకుండా ఉండడం, దుఃఖపడకుండా ఉండడం, పోగొట్టుకున్న దానికోసం దుఃఖించడం, సంపాదించదగిన దానికోసం ప్రయత్నించడం ఈ ప్రపంచంలో ప్రతివారికీ సహజం. అయితే తననుతాను తెలుసుకోవడం, తన స్వరూపం గురించి తెలుసుకోవడం మాత్రమే నిజమైన సంపాదన.

"ఈ దేహమే నేను" అని మనం భావిస్తూన్నంత వరకు భౌతిక ప్రకృతి నియమాలకు, ప్రభుత్వ నిబంధలనకూ, ఇంకా ఇతర శాసనాలకు

కట్టుబడి ఉండాలి. ఈ విధంగా ఈ దేహం రకారకాల నిబంధనలకు లోనవుతుంది. కనుక అది బద్ధమైపోతుంది. నిబంధనలు రకరకాలుగా ఉంటాయి. మనం ఏదో ఒకదానికి బద్ధులమనే ప్రసక్తి లేదు. అన్నింటికీ బాధ్యుల మవుతున్నాము. మనం ఈ జన్మలో చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకోకపోతే మన కర్మఫలాన్ని అనుసరించి మరోజన్మలో వచ్చే మరో దేహంతో ఈ పాపఫలితాలను అనుభవించవలసి ఉంటుంది *(యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్)*. ఇది ప్రకృతి నియమం. ఎవరి పాపతీవ్రతను అనుసరించి వారు ప్రాయశ్చిత్తం చేసుకోవాలని శుకదేవ గోస్వామి తెలిపాడు. ఈ ప్రాయశ్చిత్తాన్ని శాస్త్రసమ్మతమైన పద్ధతిలో చేసుకోవాలి; లేకపోతే శిక్ష తప్పదు.

ప్రజ్ఞాశాలైన పరీక్షిన్మహారాజు ఇలా తెలుపుతున్నాడు :

*దృష్టశ్రుతాభ్యాం యత్పాపం జానన్నప్యాత్మనోఽహితమ్*
*కరోతి భూయో వివశః ప్రాయశ్చిత్తమథో కథమ్*

"ప్రాయశ్చిత్తం వలన పాపాత్ములు తమ పాపాల నుంచి విముక్తులు కాగలరు. కాని ఒకరిని హత్య చేసిన వ్యక్తి(హంతకుడు) ఇతరుల చేత చంపబడితే అతని హత్యాపాతక ఫలితం నుంచి ఆ విధంగా విముక్తుడై పోతాడు, కాని ఆ హంతకుడు మరుసటి జన్మలో మరొకరిని హత్య చేయడు అనే హామీ ఏమి లేదు." (భాగ. 6.1.9) ప్రాయశ్చిత్తం చేసుకొనిన తరువాత కూడా ప్రజలు తిరిగి పాపాలను చేస్తారని పరీక్షిన్మహారాజు అభిప్రాయ పడ్డాడు. ఒక వ్యక్తి వ్యాధిగ్రస్తుడైతే వైద్యుడు అతనికి ఔషధాన్ని ఇచ్చి స్వస్థుణ్ణి చేస్తాడు. అంతమాత్రం చేత ఆ వ్యాధి తిరిగిరాదనే హామీ ఏమీ లేదు. సుఖవ్యాధులు ఎంత చికిత్స చేసినా మరల మరల వస్తూంటాయి. అలాగే దొంగ కూడా ఎన్నిసార్లు కారాగార శిక్షను అనుభవించినా తిరిగి

దొంగతనం చేస్తూనే ఉంటాడు. ఇలా ఎందుకిలా జరుగుతూ ఉంది? అందువలననే పరీక్షిన్మహారాజు, "చేసిన పాపాలను పోగొట్టుకోవడానికి ప్రాయశ్చిత్తం మంచిదే కావచ్చును. కాని ఆ ప్రాయశ్చిత్తం అతడు తిరిగి పాపాలను చేయకుండా నివారించ లేదు" అన్నాడు. హత్య చేసినవాడిని శిక్షించడం ప్రతివారూ చూస్తూనే ఉన్నారు; కాని అలా ప్రతివారు చూడడం అనేది హత్యచేయడం నుంచి హంతకుణ్ణి నివారించదు. హత్య చేయకూడదని ప్రతి మతగ్రంథమూ ప్రతీ న్యాయశాస్త్ర గ్రంథము మానవుణ్ణి హెచ్చరిస్తూనే ఉంది. అయినా ఎవరూ ఈ శాసనములను లక్ష్యపెట్టడం లేదు. "దృష్టశ్రుతాభ్యాం యత్పాపం" - స్వానుభవం వలననూ, శాస్త్ర గ్రంథ శ్రవణం వలననూ పాపకృత్యం అంటే ఏమిటో ప్రతివాడూ తెలుసుకునే ఉంటాడు. కాబట్టి : "పాపం అంటే ఏమిటో నాకు తెలియదు" అనే వాడెవడూ ఉండడు. ప్రాయశ్చిత్తం చేసుకున్నాక కూడా అవే పాపాలను పదే పదే చేస్తూ ఉంటే ఇక ప్రాయశ్చిత్తమునకు విలువ ఏముంటుంది?

*క్వచిన్నివర్తతేఽభద్రాత్ క్వచిచ్చరతి తత్ పునః*
*ప్రాయశ్చిత్తమథోఽపార్థం మన్యే కుంజరశౌచవత్*

(భాగ. 6. 1. 10)

శిక్ష పొందినప్పుడు వ్యక్తి : "నేనెంత పాపం చేశాను! ఈ పాపాన్ని ఇంకెప్పుడు చేయను" అనుకుంటాడు. కాని ప్రమాదం నుంచి బయట పడగానే తిరిగి అదే పాపం చేస్తాడు.

అలవాటు అనేది జీవికి రెండవ ప్రకృతి. దానిని పోగొట్టుకోవడం చాలా కష్టం. "శ్వా యది క్రియతే రాజా తత్కిం నాశ్నాత్యుపానహమ్" (హితోపదేశం) : కుక్కను రాజును చేస్తే అది చెప్పును చూడగానే దానిని కొరికి తినడానికి సింహాసనం నుంచి క్రిందికి దూకి పరిగెత్తుతుంది.

ఎందుచేతనంటే, అది కుక్క సహజగుణం. కుక్క రాజసింహాసనం అధిష్టించినంత మాత్రాన దాని ప్రకృతి సహజగుణం మారదు. అదేవిధంగా సత్త్వరజస్తమో గుణాల సాంగత్యం వల్ల మనకు భౌతికమైన కొన్ని లక్షణాలు ఏర్పడ్డాయి. సత్వరజోతమో గుణములకు సంబంధించిన ఈ మూడు గుణాల వల్లనే మన అలవాట్లు ఏర్పడుతున్నాయి. మనం ఏదో విధంగా భౌతికమైన ఈ మూడు గుణాలకూ అతీతుల మైనట్లయితే మన నిజమైన ఆధ్యాత్మిక ప్రకృతి ఉజ్జ్వలమవుతుంది. అదే కృష్ణ చైతన్య విధానం. కృష్ణ చైతన్యం కలవారికి సత్త్వరజస్తమో గుణాలతో సంబంధం ఉండే అవకాశం లేదు. అంతేకాక కృష్ణ చైతన్యం కలవారికి తమ నిజ స్వరూపం సహజంగానే ప్రకటమవుతుంది. ఇదే దీని పరమ రహస్యం. కృష్ణ చైతన్య మార్గాన్ని అత్యంత శ్రద్ధతో అనుసరించే వాడు, అంతకు పూర్వం అనేక అవాంఛనీయ కృత్యాలు చేసి ఉన్నా కృష్ణ చైతన్యాన్ని సాధన చేయడం వలన భౌతిక కల్మషాలు అంటని స్థితిని పొందుతాడు.

ఈ కృష్ణ చైతన్యం ఉత్తమమైన ఔషధం. కృష్ణజ్ఞానం లేనివాడు ప్రకృతి యొక్క త్రిగుణాల వలన ఏర్పడే భౌతికమైన అలవాట్లకు లోబటి వాటి నుంచి బయట పడలేక బాధపడుతాడు. జనన మరణాల పునరావృత్తి నుంచి విముక్తి పొందాలనుకునే వాడు, కృష్ణ చైతన్యమార్గాన్ని అనుసరించాలి. శ్రీకృష్ణభగవానుడు భగవద్గీత (14.26) లో చెబుతున్నాడు :

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే

"అన్ని పరిస్థితులలోను నిశ్చలమైన సంపూర్ణమగు భక్తియుక్త సేవలో నిమగ్నుడై యుండువాడు శీఘ్రమే భౌతిక ప్రకృతి త్రిగుణములను దాటి బ్రహ్మభావమును పొందును."

కృష్ణ చైతన్యమార్గం ఇది అది అను ఏ ప్రాయశ్చిత్తాన్నీ సూచించదు. జీవితాన్ని పవిత్రం చేసుకుని, ప్రేమతో భక్తియుక్త సేవలో నిమగ్నమయ్యే వరకూ ఎన్ని ప్రాయశ్చిత్తాలు చేసుకున్నా ఆత్మకు అంటుకున్న వ్యాధులు తొలగవు.

K. Nagabhushana R.
B. Com.
A. P. TRANS Co., Ltd.

52 *K. Nagabhushana Rao,*
**B. Com:**
**A. P. TRANS Co., Ltd:**

# 4. తపస్సాధన, ఆత్మ నిగ్రహం

ఒకరు కృష్ణ చైతన్యమార్గంలో ప్రవేశించక పోయినా, ప్రాయశ్చిత్తంతో తన పాపఫలితాల నుంచి తాత్కాలికంగా విముక్తి పొందవచ్చును. కాని అతడు మరల మరల సవ్యమైన మార్గం నుంచి మరలుతుంటాడు. అందుచేతనే, పరీక్షిన్మహారాజు శుకదేవ గోస్వామితో : "క్వచిన్నివర్తతేఽభద్రాత్ క్వచిచ్చరతి తత్పునః ప్రాయశ్చిత్తమతోఽపార్థం"– "పాపాలు మరల మరల చేస్తూండడం, వాటికి ప్రాయశ్చిత్తం మరల మరల చేసుకుంటూ ఉండడం, కేవలం కాలాన్ని వృథా చేసుకోవడమేనని అనిపిస్తుంది" అన్నాడు. అతడు గజస్నానాన్ని ఉదాహరణంగా తెలిపాడు. ఏనుగు సరస్సులో గాని, చెరువులో గాని దిగి శుభ్రంగా స్నానం చేస్తుంది. కాని గట్టు ఎక్కగానే తన దేహమంతట తిరిగి దుమ్మును చల్లుకుంటుంది. వెంటనే దాని దేహం ధూళితో నిండుతుంది. అంటే స్నానం వల్ల ఏమీ ప్రయోజనం లేదు అని. అలాగే మనిషి ప్రాయశ్చిత్తంతో పాపాలను తొలగించుకున్నా కూడా ఆ పాపకర్మలనే తిరిగి చేస్తూ ఉండడం వల్ల ప్రయోజనం ఏముంటుంది? అందుచేతనే పరీక్షిన్మహారాజు శుకదేవ గోస్వామిని : "ప్రకృతి త్రిగుణాల వలన కలిగే సకల కల్మషముల నుంచి మనిషి చివరకు ముక్తుడవడం ఎలాగ? అతడు పాపాల నుంచి విముక్తుడు కాకపోతే ప్రాయశ్చిత్తం వల్ల ప్రయోజనం ఏమిటి?" అని రెండవ ప్రశ్న వేశాడు. ఇది చాలా ముఖ్యమైనది.

శుకదేవ గోస్వామి ఇలా సమాధానం తెలిపాడు (భాగ. 6.1.11) :

కర్మణా కర్మనిర్హారో న హ్యాత్యన్తిక ఇష్యతే
అవిద్వదధికారిత్వాత్ ప్రాయశ్చిత్తం విమర్శనమ్

"కర్మను తప్పించు కోవడానికి మనిషి ఎన్ని ప్రాయశ్చిత్తములను చేసినా దుఃఖములకు అంతముండదు." ఉదాహరణకు : ఐక్యరాజ్య సమితి ప్రపంచంలో శాంతిస్థాపన కోసం ప్రయత్నిస్తూనే ఉంది. కాని అది యుద్ధాన్ని ఆపలేకపోతూంది. యుద్ధాలు తిరిగి చెలరేగుతూనే ఉన్నాయి. మొదటి ప్రపంచ యుద్ధం తరువాత రాజనీతిజ్ఞులు, రాజకీయ శాస్త్రజ్ఞులు నానాజాతి సమితిని ఏర్పాటు చేశారు. అయినా రెండవ ప్రపంచ యుద్ధం చెలరేగింది. ఇప్పుడు ఐక్యరాజ్య సమితి అవతరించింది. అయినా యుద్ధాలు కొనసాగుతూనే ఉన్నాయి. నిజానికి దాని అసలైన లక్ష్యం యుద్ధాల్ని ఆపడమే కాని అది జరగడం లేదు. ఒక పనివల్ల యుద్ధం జరుగుతూంది. మరోపని వల్ల యుద్ధం తాత్కాలికంగా ఆగుతూంది. కాని మళ్ళీ ఏదో అవకాశం రాగానే మరో యుద్ధం జరుగుతూంది. పాపపుపనులు, ప్రాయశ్చిత్తాలు – ఈ చక్రం కూడా అలాగే ఉంది. నిజంగా మనకు కావలసింది బాధలు, యుద్ధాల నుంచి విముక్తి. కాని అది మాత్రం లభించడం లేదు.

ఒక రకమైన యుద్ధం అలజడిని పుట్టిస్తూందనీ, మరోరకమైన యుద్ధం దానిని కొంతకాలం పాటు ఆపి వేస్తుందనీ, ఇది మన సమస్యకు శాశ్వత పరిష్కారం కాదనీ శుకదేవ గోస్వామి తెలిపాడు. ఇలాంటి సమస్యలన్నీ అజ్ఞానం వల్లనే కలుగుతాయని – "అవిద్వదధికారిత్వాత్" – అన్నాడు. 'అవిద్వత్' అంటే జ్ఞానం లేకపోవడం. "అవిద్వదధికారిత్వాత్ ప్రాయశ్చిత్తం విమర్శనమ్." నిజమైన ప్రాయశ్చిత్తం జ్ఞానం ఉన్నప్పుడే సాధ్యమవుతుంది. ఈ యుద్ధాలు "ఎందుకు" జరుగుతున్నాయి? ఈ కష్టాలు "ఎందుకు" సంభవిస్తున్నాయి? ఈ "ఎందుకు" లేక "ఎవరి

వలన” అనే ప్రశ్నలు(కేనోపనిషత్తులో ఉన్నట్లు) మనస్సులో కలుగనంత వరకు మనిషి తన జీవితానికి నిర్దేశించబడిన విధ్యుక్త ధర్మాలను సక్రమంగా నిర్వర్తించ లేదు. అంటే మనిషి మనస్సులో : “నేనెందుకు బాధపడుతున్నాను? ఎక్కడ నుంచి వచ్చాను ? నా నిజ స్వరూపమేమిటి ? మరణం తరువాత నేనెక్కడికి వెళ్ళవలెను ? నేను ఎందుకు ఈ దుఃఖపూరితమైన జీవితంలో చిక్కుకున్నాను? జన్మ మృత్యు జరా వ్యాధు లెందుకున్నాయి ?” అనే ప్రశ్నలు కలుగాలని అర్థం.

అయితే ఈ ప్రశ్నలకు సమాధానం ఏమిటి? శుకదేవ గోస్వామి ఇలా చెబుతున్నాడు (భాగ. 6. 1. 12) :

నాశ్నతః పథ్యమేవాన్నం వ్యాధయోఽభిభవన్తి హి
ఏవం నియమకృద్రాజన్ శనైః క్షేమాయ కల్పతే

తన వ్యాధిని నిజంగా నివారించుకోదలచిన వాడు, నియమిత విధులను అనుసరించాలి. వ్యాధిగ్రస్తుడు తన వ్యాధిని పోగొట్టుకోవడానికి వైద్యుడు నిర్ణయించిన పద్ధతిని అనుసరించకపోతే వ్యాధి నుంచి విముక్తుడు కాలేడు. అదేవిధంగా, వైదిక విజ్ఞానం నిర్ణయించినట్లు ఆలోచించకపోయినా, వివేకంతో దానికి అనుగుణంగా వ్యవహరించక పోయినా మనిషి జీవిత సమస్యలను ఎలా పరిష్కరించుకోగలడు ? ప్రాయశ్చిత్తం వల్ల కష్టాలు తాత్కాలికంగా మాత్రమే అణగిమణగి ఉంటాయి, అవి తిరిగి వస్తూనే ఉంటాయి.

ఈ భౌతిక జీవితంలో లేక పాపమయ జీవితంలో మనం తప్పక పాపాలు చేయవలసి వస్తున్నట్లు, వాటి ఫలితాన్ని అనుభవించక తప్పని పరిస్థితి ఉన్నట్లు మనం ప్రవర్తిస్తున్నామని శుకదేవ గోస్వామి చెబుతున్నాడు. పరిస్థితి ఇలా ఉంది కనుక పాపాలు చేయడం, వాటి ఫలితాలను

అనుభవించడం అనే చక్రాన్ని ఆపివేయాలనుకుంటే మనుషులు జ్ఞానమార్గంలో పురోగమించాలి, సామాన్య మానవులు లేక ఫలాపేక్షతో కర్మలు చేసేవారు(కర్ములు) ఏవో సుఖానుభవాల కోసం రాత్రింబవళ్ళు కష్టపడుతూ తిరిగి దుఃఖాల పాలవుతున్నారు. అలాంటి కర్ముల సమస్యలు ఎప్పటికీ పరిష్కారం కావు. కాబట్టి శ్రీమద్భాగవతం నిర్దేశించిన ప్రకారం మనిషి తననుతాను జ్ఞానవంతునిగా చేసుకోవాలి. దీనికి అత్యవసరమైన మొదటి విధి తపస్సు. కొన్ని దినాలపాటు భోజనం చేయకూడదనీ, ఉపవాసాలు చేయాలనీ మధుమేహ రోగికి వైద్యుడు చెప్పినప్పుడు ఆ రోగికి ఉపవాసాలు చేయడం ఇష్టం లేకపోయినా, వ్యాధి నుంచి విముక్తుడు కావడానికైనా ఉపవాసాలు చేయాలి. భరించలేని పరిస్థితిని స్వచ్ఛందంగా భరించాలను కోవడమే తపస్సు. ఈ తపస్సును చేయగలిగే శక్తి ఉంటే బావుంటుంది. ఇలాంటి తపస్సు చేయడమే మనిషి జీవితానికి లక్ష్యం. ఈ తపస్సును వైదిక సంస్కృతి ప్రతి మనిషికీ విధిస్తుంది. భారతదేశంలో కఠిన తపస్సు ఆచరించేవారు చాలామంది ఉన్నారు. వారినెవరైనా చూడవచ్చు. వారు శీతాకాలంలో మెడవరకూ నీళ్ళలో నిలచి ధ్యానం చేస్తారు. మంచి శీతాకాలంలో చల్లటి నీళ్ళలో నిలబడడం చాలా కష్టం. అలాగే మండు వేసవికాలంలో చుట్టూ అగ్ని ప్రజ్జ్వలింప చేసుకుని ఆ మంటల మధ్య నిలబడి తపస్సు చేస్తారు. అది కూడా చాలా కష్టం. అయినా స్వచ్ఛందంగానే వారు అలా చేస్తారు. భారతదేశంలో యోగులు చేసే ఘోర తపస్సులకు ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే.

ప్రతివ్యక్తికీ ఏదో ఒక తపస్సు తప్పక అవసరం. తపస్సు లేకుండా ఎవరూ ఆధ్యాత్మిక జీవితంలో లేదా జ్ఞానమార్గంలో కాని పురోగమించ లేరు. మనం పశువులలాగ ఆహారము, నిద్ర, భయము, మైథున క్రియల వంటి వాటిలో పాల్గొంటూ, తపోమార్గాన్ని అంగీకరించకపోతే మానవ

జీవితం నిష్ప్రయోజనం అవుతుంది. అందుచేతనే మేము మా కృష్ణ చైతన్య సంఘంలో దీక్షాసభ్యులు కాగోరేవారు తపస్సు చేయవలసి ఉంటుందని ముందే చెబుతాము. పాశ్చాత్యదేశాలలో గొప్పతపస్సు అంటే ముఖ్యంగా వ్యభిచారం, మద్యపానం, మాంసాహారం, జూదం - ఇవి మానడం. మేము కేవలం ఈ నియమాలను మాత్రమే కోరుతున్నప్పటికినీ, వీటిని పాటించడం వారికి చాలా కష్టం. ఇంగ్లాండులో ఒక ధనికుడు వైష్ణవ సతీర్థ్యుని వద్దకు వచ్చి : "స్వామిజీ! నన్ను బ్రాహ్మణునిగా మార్చగలరా?" అని ప్రశ్నించాడు. దానికి ఆ స్వామీజీ : "మార్చగలను. ఎందుకు మార్చలేను? కాని మీరు వ్యభిచారం, మద్యపానం, జూదం, మాంసాహారం అనే నాలుగు అలవాట్లను మానుకోవలసి ఉంటుంది" అని సమాధానం చెప్పాడు. అప్పుడా బ్రిటిష ధనికుడు "ఈ నాల్గింటిని మానుకోవడం అసాధ్యం" అన్నాడు. నిజమే. ఐరోపాలో గాని, అమెరికాలో గాని బాల్యం నుంచే స్వేచ్ఛాజీవనం అలవాటు కాబట్టి వారికి అది అసాధ్యం. భారతదేశపు సంపన్నులు తరచు పాశ్చాత్య దేశాలకు వెళ్ళి ఆ స్వేచ్ఛా జీవన విధానాన్ని నేర్చుకుని, తాము ఎంతో పురోగమిస్తున్నామని భావిస్తారు. వైదిక సంస్కృతి సహజంగానే భారతీయులకు తపస్సును నేర్పుతుంది. కాని వారు అమెరికాకు వెళ్ళి ఆ సంస్కృతిని విస్మరించి మరొక జీవన విధానాన్ని అవలంబిస్తారు. పరిస్థితి ఏమైనప్పటికినీ, ఆధ్యాత్మిక జ్ఞానమార్గంలో పురోగమించ దలచుకున్న వారు, జీవితానికి సంబంధించిన అన్ని సమస్యలను పరిష్కరించా లనుకునే వారు తపస్యా జీవితాన్ని, నియమ నిగ్రహాలున్న జీవితాన్ని గడపాలి.

విధినిషేధాలు మనుషులకే కాని జంతువులకు కాదు. మనం నిత్యజీవితంలో నియమ నిబంధనలను పాటిస్తూనే ఉన్నాము. మనం (అమెరికాలో) ఎడమ ప్రక్కన కారును నడపలేము. లేదా ఎర్రలైటు

వెలిగినప్పుడు చట్టవిరుద్ధంగా కారును నడిపితే శిక్షను అనుభవించ వలసి ఉంటుంది. కాని కుక్కవీధిలో ఎడమవైపు నడిచినా, ఎర్రలైటు వెలిగినప్పుడు వీధిని దాటినా దానిని శిక్షించరు. ఎందుకంటే అది జంతువు కనుక. మనిషికి జంతువు కన్న జ్ఞానం ఎక్కువ అని నమ్మడం వల్లనే, చట్టం మనిషికీ జంతువుకీ మధ్య వ్యత్యాసం చూపిస్తుంది. మనం నియమ నిబంధనలను పాటించకపోతే మనం జంతువులతో సమాన మవుతాము. స్వేచ్ఛ అంటే నియమ నిబంధనలు పాటించని స్వైర జీవితం అని ప్రచారం జరుగుతున్నట్లు అనిపిస్తుంది. కాని నిజం తెలుసుకో గలిగిన వాడు నియమ నిబంధనలు లేని స్వేచ్ఛాజీవనం పశుజీవనమని గ్రహిస్తాడు. కాబట్టి మనిషికి తపస్సు చాలా అవసరమని శుకదేవ గోస్వామి సూచించాడు (భాగ. 6.1.13). మనం మన జీవితసమస్యల నుంచి నిజంగా స్వేచ్ఛను కోరుకునే టట్లయితే నియమ నిబంధనలు కల తపస్యాజీవితాన్ని అనుసరించి తీరాలి, లేకపోతే భౌతిక జీవితపు బంధనాలు తప్పవు.

తపస్సు(తపస్య) అంటే ఏమిటి ? తపస్సు యొక్క మొట్టమొదటి సూత్రం బ్రహ్మచర్యం. అంటే నియమ పూర్వకమైన కామభోగం. బ్రహ్మచర్యం అంటే స్త్రీ సంపర్కం ఎంతమాత్రం లేకుండా ఉండడం. వైదిక సంస్కృతి ప్రకారం జీవిత ప్రారంభంలో బ్రహ్మచర్య నియమాన్ని కఠినంగా పాటించాలి. బ్రహ్మచారి పెద్దవాడయ్యాక వివాహం చేసుకొని గృహస్థుడు కావచ్చును. గృహస్థుడయ్యాక సంసారం చేయవచ్చును. కాని బ్రహ్మచర్యాశ్రమంలో ఇంద్రియ నిగ్రహం తప్పనిసరి. ఈనాటి పరిస్థితులలో ప్రజలకు తపస్యాజీవితం ఎలా గడపాలో శిక్షణ లేకపోవడం వలన తపస్సంటే ఏమిటో తెలియక దానిని ఆచరించక పతితులు అవుతున్నారు. ప్రతిఒక్కరు తపస్యాజీవితంలో చక్కని శిక్షణను పొందాలి. అర్థంలేని విమర్శలు ఉపయోగపడవు.

తపశ్చర్యతో క్రమబద్ధమైన జీవితాన్ని గడిపేవారు బ్రాహ్మణులు అని వేదాలు ఘోషిస్తున్నాయి. "*య ఏతదక్షరం గార్గి విదిత్వాస్మాల్లోకాత్ ప్రైతి స బ్రాహ్మణః / యో వా ఏతదక్షరం గార్గి అవిదిత్వాస్మాల్లోకాత్ ప్రైతి స కృపణః*" (బృహద్ ఆరణ్యకోపనిషత్తు, 3.8.10). ప్రతిమనిషీ మరణిస్తున్నాడు. ఎవరూ ఈ లోకంలో శాశ్వతంగా ఉండరు. కాని తపోజీవితం గడిపిన తరువాత మరణించేవాడే బ్రాహ్మణుడు. తపోజీవితం పాటించక పిల్లిలాగ, కుక్కలాగ జీవించి మరణించేవాడు కృపణుడు. బ్రాహ్మణుడు, కృపణుడు అనే పదాలు వైదికసాహిత్యంలో తరచు ప్రయోగించబడ్డాయి. కృపణుడు అంటే లోభి. బ్రాహ్మణుడు అంటే ఉదారుడు, విశాలహృదయుడని అర్థం. "*బ్రహ్మజానాతీతి బ్రాహ్మణః*" - భగవంతుడిని పరమసత్యాన్ని తెలుసుకున్నవాడు బ్రాహ్మణుడు. అది తెలియనివాడు పశువు. ఇదే మనిషికీ పశువుకూ మధ్య గల తేడా. మనిషి మనిషి అనిపించుకోవాలంటే పరమసత్యాన్ని అర్థం చేసుకోవడానికి శిక్షణ పొందాలి. జ్ఞానార్జనమే మానవజీవిత ముఖ్య లక్ష్యం. కనుక పాఠశాలలు, కళాశాలలు స్థాపించబడ్డాయి. తత్త్వశాస్త్రవేత్తలు నియమితులయ్యారు. ఆహార నిద్రా భయ మైథునాల గురించి ప్రతిజీవికి సహజంగానే తెలుస్తుంది. కనుక వాటిని నేర్పవలసిన పని లేదు. మానవ జీవితం ఇంతకన్న విశిష్టమైన జ్ఞానమును పొందడానికి అంటే తపస్సాధనకూ జ్ఞాన సంపాదనకు ఉద్దేశించబడినది.

బ్రహ్మచర్యం గురించి వేదాలలో అనేక వర్ణనలు ఉన్నాయి. ఈ బ్రహ్మచర్యం తపస్సుకు అంకితమైన ప్రారంభ దశను సూచిస్తుంది : "*స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణమ్ సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృత్తిరేవ చ*" (శ్రీమద్భాగవతం, శ్రీధర భాష్యం, 6.1.13). బ్రహ్మచర్యాన్ని సక్రమంగా అనుష్ఠించేవాడు స్త్రీ సంపర్కం గురించి తలచనైనా

తలంచ కూడదు; ఆ విషయం గురించి మాట్లాడకూడదు. స్త్రీ సాంగత్య విషయాలతో నిండిన ఆధునిక సాహిత్యాన్నీ, వార్తాపత్రికలను చదవడం బ్రహ్మచర్య సూత్రాలకు విరుద్ధం. అదేవిధంగా స్త్రీలను చూడడం, వారితో రహస్యంగా సంభాషించడం, స్త్రీ సంపర్కం గురించి సంకల్పించడం, ప్రయత్నించడం మొదలైన స్త్రీ సంపర్కానికి దారితీసే పనులన్నీ బ్రహ్మచర్య సూత్రాలకు వ్యతిరేకమైనవి. ఇటువంటి వాటికి దూరంగా ఉండేవాడే నిజమైన బ్రహ్మచర్యాన్ని అనుష్ఠించ గలడు.

నియమనిష్ఠల వలనా, బ్రహ్మచర్యం వలనా, ఇంద్రియ నిగ్రహ, మనోనిగ్రహాల వలనా, మనిషి పవిత్ర జీవితంలో పురోగమించ గలుగుతాడు. అదేవిధంగా సత్పాత్రదానం వలన కూడా పవిత్ర జీవితంలో పురోభివృద్ధిని సాధించగలరు. దీనిని త్యాగం అంటే పరిత్యజించడం అంటారు. బాగా ధనం ఉన్నవాడు దానిని తన దగ్గరే ఊరక ఉంచుకోకుండా తన పరిమితులకు లోబడి శ్రీకృష్ణుని సేవ కోసం ఉపయోగించాలి. ధనమైనా, దేహబలమైనా శ్రీకృష్ణుని సేవకోసం ఉపయోగించినప్పుడే సార్ధకమవుతాయి.

జీవాత్మ దేహాన్ని త్యజించగానే అతనికి ఆ దేహంతో కూడబెట్టిన ధనం తోనూ, ప్రతివస్తువు తోనూ సంబంధం తెగిపోతుంది. జీవుడు మరోదేహంలో ప్రవేశించడం వలన గతజన్మలో గడించిన డబ్బు ఎక్కడ ఉందో ఏ విధంగా ఖర్చు అవుతుందో తెలియదు. ఒక వ్యక్తి తాను ఆర్జించిన ధనాన్ని తన కుమారులకు గాని వారసులకు గాని చెందేటట్లు వ్రాస్తూ, దానిని ఎలా ఖర్చుపెట్టాలో ప్రకటించి ఈ లోకాన్ని వదలి పోవచ్చును. అయితే అతడు లక్షల కొలది ధనాన్ని వదలిపోయినా మరుసటి జన్మలో ఆ ధనం మీద అతనికి ఎలాంటి హక్కు ఉండదు. అందుచేత ప్రతివారూ ధనం తమ చేతుల్లో ఉన్నప్పుడే దానిని సద్వినియోగం

చేసుకోవాలి. దానిని దుర్వినియోగం చేస్తే భౌతిక బంధనంలో చిక్కు కుంటారు. ధనాన్ని సత్కార్యాలకు వినియోగించితే ప్రతిఫలంగా మంచి ఫలితాలను పొందుతారు. ఈ విషయం భగవద్గీతలో స్పష్టంగా తెలుపబడింది.

దానం సాత్త్వికం, రాజసం, తామసం అని మూడు రకాలనీ భగవద్గీత తెలుపుచున్నది. సత్త్వగుణం కలవారికి ఎటువంటి పాత్రునికి దానం ఇవ్వాలన్నది తెలుస్తుంది. భగవద్గీత (9.29) లో శ్రీకృష్ణుడు ఇలా చెబుతున్నాడు :

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్

"నేనెవరినీ ద్వేషింపను ఎవరి యందును పక్షపాతమును కలిగి యుండను. నేను సర్వుల యెడను సమముగా వర్తింతును. కాని భక్తితో నాకు సేవనొసగెడివాడు నాకు మిత్రుడై నా యందుండును మరియు నేనును అతనికి మిత్రుడనై యుందును."

శ్రీకృష్ణుడు ప్రతివస్తువుకూ యజమాని కనుక (ఈశావాస్య మిదం సర్వం) అతనికి ధనం అవసరం లేదు. అయినా అతడు దానం ఇమ్మని మనలను కోరుతున్నాడు. ఉదాహరణకు, శ్రీకృష్ణుడు వామనరూపం ధరించి బలిచక్రవర్తి వద్దకు వెళ్ళి దానం అడిగాడు. అతడు 'సర్వలోక మహేశ్వరమ్'- సర్వలోకాలకూ అధిపతి అయినా : "దయచేసి నాకు దానం చేయండి" అని అడుగుతున్నాడు. ఎందుకు? మనం శ్రీకృష్ణుని సొమ్మును ఎంత త్వరగా తిరిగి చెల్లిస్తే అంత మంచిది. మన పరిస్థితి మెరుగవుతుంది. ఈ విధంగా సొమ్మును చెల్లించండి అని అడగడం మనకు బావుండదు. కాని, మనం భగవంతుని సొమ్మును దొంగిలించాము. కాబట్టి, నిజానికి

మనం అందరం దొంగలమే. ధనం కలిగి భగవత్ చైతన్యమార్గం అనుసరించనివాడు భగవంతుని ఆస్తిని అపహరించినట్లు గ్రహించాలి. అది భౌతిక జీవిత స్వభావం. మనం సవ్యంగా ఆలోచించి వాస్తవ సత్యాన్ని గ్రహించినట్లయితే, మనం అనుభవిస్తున్న సొమ్ముకు యజమాని అయిన భగవంతుణ్ణి అర్థం చేసుకోనప్పుడు, మన వద్ద గల ధనం అంతా దొంగసొమ్మే అని గ్రహిస్తాము. తన ధనాన్ని యజ్ఞం కోసం ఖర్చుచేయనివాడు దొంగ అని భగవద్గీత (3.12) తెలుపుతున్నది(యో భుంక్తే స్తేన ఏవ సః). ఉదాహరణకు : అపారధనాన్ని గడించి, రాబడిపన్ను తప్పించు కోవడానికి ఆ డబ్బును రహస్యంగా దాచిపెట్టేవాడిని ప్రభుత్వం అపరాధిగా పరిగణిస్తుంది. "నేనే ఈ ధనం సంపాదించాను. నేనెందుకు ప్రభుత్వానికి పన్ను చెల్లించాలి ?" అని అతడు అనరాదు. అతడు రాబడిపన్ను చెల్లించాలి లేదా శిక్షను అనుభవించాలి. ఈ విధంగా ఉన్నత స్థాయిలో ఆలోచించినా కూడా మనకు ఉన్నదంతా శ్రీకృష్ణునిదే, భగవంతునిదే. దానిని అతని ఇష్టప్రకారమే వినియోగించాలి. మనం ఒక భవనం నిర్మించాలనుకుంటే దానికి అవసరమైన రాయి, మట్టి, కలప ఎక్కడ లభిస్తాయి? మనం కృత్రిమంగా కలపను తయారు చేయలేము. కలప భగవంతుని సొత్తు. మనం ఇనుమును కూడా కృత్రిమంగా తయారు చేయలేము. దానిని మనం గనుల నుంచి తీసుకోవాలి. ఆ గనులు కూడా భగవంతుని ఆస్తే. మట్టితో తయారుచేసే ఇటుకలు కూడా భగవంతునివే. మనం కేవలం కాయ కష్టాన్ని మాత్రమే చేస్తున్నాము. అది కూడా భగవంతునిదే. మనం మన చేతులతో పని చేస్తూన్నాము. కాని అవి మనవి కావు; భగవంతునివి. ఎందుకంటే భగవంతుడు కనుక మన చేతులను ఉపయోగించుకోగల శక్తిని లాగివేస్తే మనం ఎందుకు పనికిరాము.

శ్రీమద్భాగవతం, భగవద్గీత మొదలైన ప్రామాణికమైన వైదిక జ్ఞాన

గ్రంథాల నుంచి ఈ ఆధ్యాత్మిక విషయాలను గ్రహించడానికే మనకు లభించిన ఈ మానవజన్మ అనే గొప్ప అవకాశాన్ని ఉపయోగించు కోవాలి. నిజమైన ప్రాయశ్చిత్తానికి ఆలోచన, ధైర్యం, ధ్యానం - ఇవి అవసరమని శ్రీమద్భాగవతంలో శుకదేవ గోస్వామి తెలిపారు. తాను ఈ భౌతిక దేహమా లేక ఈ భౌతిక దేహానికి అతీతులనే విషయం గురించి ఆలోచించి భగవంతుడంటే ఏమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించాలి. కృష్ణ చైతన్యంలో ఈ భావాలను అధ్యయనం చేయాలి. ఏ ఆలోచనా లేకుండా మనం కాలాన్ని వృథా చేయకూడదు. ఈ జ్ఞానాన్ని సంపాదించాలనుకునే వారు కఠిన నియమాలతో తపస్సు చేయాలి. ఈ తపస్సును కూడా ఇదివరకే వివరించినట్లు బ్రహ్మచర్యంతో ప్రారంభించాలి. బ్రహ్మచర్యం పాటించడం చాలా కష్టం. మానవజాతికే కాదు, జంతు జాతికి కూడా ప్రధానమైన భౌతికాకర్షణ లైంగిక సుఖమే. కొందరు భావిస్తున్నట్లు శాకాహారం తినడం ప్రారంభించినంత మాత్రాన జ్ఞానవంతు లవుతారన్నది పూర్తిగా సత్యం కాదు. కేవలం శాకాహారమును తినే పిచ్చుకలు పావురాలు రోజుకు మూడువందల సార్లు సంభోగిస్తున్నాయి. మాంసాహారం తప్ప మరొకటి తినని సింహం సంవత్సరానికి ఒక్కసారి మాత్రమే సంభోగిస్తుంది. ఆధ్యాత్మిక జీవితమును సాధించడం అనేది కేవలం శాకాహారానికి సంబంధించిన ప్రశ్న మాత్రమే కాదు. అది ఉన్నత జ్ఞానానికి సంబంధించినది. ఉన్నత స్థితి నందుకున్నవాడు సహజంగానే శాకాహారి అవుతాడు. "పండితాః సమదర్శినః" - ఉన్నత జ్ఞానం కల పండితుడు బ్రాహ్మణ, గజ, శునక, గోవుల విషయంలో ఎటువంటి తేడాను పాటించడు. అతడు సమదర్శి. అతడు అన్ని జీవులను సమానంగా చూస్తాడు. అది ఎలా సాధ్యపడుతుంది? అతడు బాహ్యదేహాన్ని కాకుండ లోపల గల ఆత్మను, ఆధ్యాత్మిక విస్ఫులింగాన్ని చూస్తాడు. "ఇది కుక్క

ఇది కూడా జీవుడే. పూర్వకర్మవశాన కుక్కగా జన్మించింది" అని పండితుడు భావిస్తాడు. ఈ పండితుడు కూడా జీవాత్మయే; పూర్వజన్మ పుణ్యం వలన మంచి జన్మను పొందాడు. ఇటువంటి ఉన్నతస్థితిని పొందినవాడు బాహ్యా దేహాన్ని చూడడు; అంతర్లీనంగా గల ఆత్మనే చూస్తాడు. ప్రాణుల మధ్య వ్యత్యాసాన్ని చూడడు.

నిజానికి నరమాంస భక్షకులకూ శాకాహారులకూ మధ్య కూడా భేదం లేదు. ఎందుచేతనంటే గొర్రెపిల్లకూ, ఆవుకూ ప్రాణం ఉన్నట్లే గడ్డికీ, కూరగాయలకూ కూడా ప్రాణం ఉంటుందని మనం గ్రహించడమే. ఈ విషయంలో ఈశోపనిషత్తు పేర్కొనిన వైదిక సూచన మనకు మార్గదర్శక సూత్రం కావాలి. ఈశోపనిషత్తు(1) ఇలా ప్రకటిస్తూంది :

*ఈశావాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్*
*తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్య స్విద్ధనమ్*

"ఈ విశ్వంలో గల చేతనాచేతన వస్తువులన్నీ భగవంతునికే చెంది, ఆయన చేతనే నియమించ బడుతున్నాయి. అందుచేత మానవుడు తన కొరకే కేటాయించ బడినవాటిని, తనకు కావలసిన వస్తువులను మాత్రమే తీసుకోవాలి. ఎవరూ కూడా ఇతరుల వస్తువులను స్వీకరించ కూడదు. అవి ఎవరికి చెందినవో తెలుసుకుని ఉండాలి."

ఈ సృష్టిలోని సర్వస్వం ఆ దేవాదిదేవుని సొత్తే కనుక ఎవరైనా భగవంతుడు తనకు కేటాయించిన దానినే అనుభవించాలి కాని ఇతరుల సొత్తును తాకకూడదు. మానవుని దంతాలు కేవలం పళ్ళు ఫలాలనూ, శాకాహారాన్నీ చాలా సులభంగా నమలి, తినడానికి సృష్టించబడ్డాయి కనుక మనిషి ఫలాలను కూరగాయలనూ మాత్రమే తింటూ జీవితమును కొనసాగించాలని వైదిక జీవిత విధానాన్ని, సకల వేదశాస్త్ర గ్రంథాలు

తెలుపుతున్నాయి. "జీవో జీవస్య జీవనమ్" అనే వ్యాఖ్యం ప్రకారం ఒకప్రాణి మరొకప్రాణిని తిని జీవించడం ప్రకృతి సహజం అయినప్పటికినీ, మానవుడు వివేకంతో ఆలోచించి శాకాహారమే స్వీకరించాలి. ఫలాలు, పూలు, కూరగాయలు, వడ్లు, ధాన్యాలు, పాలు మనుషుల కోసం సృష్టించబడ్డాయి. ఉదాహరణకు : పాలు పశువుల వల్ల లభిస్తున్నాయి. పశువుల రక్తమే పాలుగా మారుతుంది. ఆవుపాలు మనిషికి ఉద్దేశించబడినవి కనుకనే ఆవు దగ్గర దాని దూడకు కావలసిన వాటికంటె ఎక్కువ పాలు ఉంటాయి. కాబట్టి, మనిషి ఆవుల పాలను మాత్రమే పితుకుకొని, ఆవులను బ్రతుకనివ్వాలి. ఈ విధంగా మనిషి ప్రకృతి నియమాలను అనుసరిస్తే సుఖపడుతాడు. "*తేన త్యక్తేన భుంజీథా*" - భగవంతుడు తనకు కేటాయించిన దానినే అనుభవిస్తూ మనిషి సుఖంగా జీవించాలి.

మనం ఈ కృష్ణవిజ్ఞానంతో మన చైతన్యాన్ని ఉన్నతస్థితికి పెంచుకోవాలి. ప్రతివాని హృదయంలోనూ త్యాగగుణం ఉంటుంది. కాని దానిని పూర్తిగా సద్వినియోగం చేసుకోవడం మనకు తెలియదు. మనశక్తి అంతా శ్రీకృష్ణునిదే కనుక మనం శ్రీకృష్ణుని కోసమే ఆ శక్తిని వినియోగించాలి. శ్రీకృష్ణుని కోసం వినియోగించడం వలన మనకు ఏ నష్టమూ ఉండదు. శ్రీకృష్ణునికి ఆహారమును నివేదించినప్పుడు, అతడు దానిని స్వీకరించి తిరిగి మొత్తమును మన కోసం తిరిగి ఇస్తాడు. కేవలం మనం శ్రీకృష్ణునికి ఆహారం నివేదించినంత మాత్రాననే కృష్ణభక్తులము కాగలము. అంతకంటె ఎక్కువగా మనం ఒక్క పైసా కూడా ఖర్చు చేయనక్కర లేదు. ఉన్నత దృష్టితో చూస్తే ప్రతీది శ్రీకృష్ణునిదే. మనం ప్రతిదానినీ శ్రీకృష్ణునికి నివేదించడం వలన ఉన్నత స్థితికి చేరుకోగలము. ఆధ్యాత్మిక జీవితంలో పురోగమించడానికి ఇదే నిరూపించబడిన, అత్యుత్తమమైన మార్గం.

*K. Nagabhushana Rao,*

**B. Com:**

**A. P. TRANS Co., Ltd:**

K. Nagabhushana K
B. Com.
A. P. TRANS Co., Ltd:

# 5. కృష్ణ చైతన్యంలో స్థిరత్వ సాధన

భౌతిక భోగభాగ్యాలలో ఎంతో ఉన్నత స్థితిని అందుకున్నప్పుడు, కొన్నిసార్లు వాటన్నింటినీ త్యజించాలన్న ప్రవృత్తి కలుగవచ్చును. ఈ భౌతిక ప్రపంచంలో భోగం, త్యాగం అనే రెండు ప్రవృత్తులు ఉన్నాయి. భోగం అంటే ఇంద్రియ సుఖానుభవం. త్యాగం అంటే ఈ భౌతిక సుఖాలను పరిత్యజించడం. అయితే మార్గదర్శకత్వం లేకపోతే త్యాగం చేయడం ఎలాగో మానవుడు తెలుసుకోలేడు. ముందుగా మనిషి భోగాలను అనుభవించా లనుకుంటాడు; భోగభాగ్యాలతో విసుగెత్తిపోయిన తరువాత వాటిని త్యజిస్తాడు. ఆ త్యాగంతో విసుగెత్తి తరువాత తిరిగి భోగం పట్ల ఆసక్తుడవుతాడు. ఈ విధంగా అతడు గడియారంలోని లోలకం లాగ ఇటూ అటూ ఊగిసలాడుతుంటాడు. ఈ విధంగా మనం భోగస్థితి నుంచి త్యాగస్థితికి, తిరిగి త్యాగస్థితి నుంచి భోగస్థితికి అటు ఇటూ ఊగిసలాడు తున్నాము.

కర్మలు అంటే ఫలాపేక్షతో కర్మలు చేసేవారు ఈ ప్రాపంచిక సుఖాలన్నింటినీ అనుభవించడానికి ప్రయత్నిస్తారు; తమ కర్మలకు ఫలితాలను పొందాలను కుంటారు. ఈ కారణం వలననే వారు భౌతిక సుఖాలను అనుభవించడం కోసం రేయింబవళ్ళు నిరంతరం విరామం లేకుండా పరుగులు పెడుతూ కష్టపడుతున్నారు. అయితే దీనికి విరుద్ధంగా మరొకవైపు ప్రాపంచిక సుఖాలపట్ల అసంతృప్తితో వాటిని ఏ మాత్రము కోరనివారు, నేటి నాగరికత నచ్చని కొందరు యువకులు ఉన్నారు. ఈ విధంగా ప్రపంచంలో కొందరు భోగాసక్తులు కొందరు త్యాగాసక్తులు

ఉన్నారు. కాని, భోగాలను అనుభవించడమో లేక త్యాగం చేయడమో మనకు సరియైన పద్ధతి కాదు కనుక ఈ రెండింటిలో ఏ మార్గాన్ని అనుసరించినా మనం సుఖంగా ఉండలేము. ప్రతీది శ్రీకృష్ణుని సొత్తే కనుక ఎవరిదీ ఏమీ లేదు కనుక మనం అనుభవిస్తూన్నదంతా శ్రీకృష్ణుని సొమ్మే(ఈశావాస్య మిదం సర్వమ్). చెట్లను, మొక్కలను, నీటిని, భూమిని దేనినీ సృష్టించలేము. కనుక వాటిపై మనకు ఎలాంటి అధికారమూ లేదు. మనదంటూ ఏదీ లేదు కనుక మనం దేనినీ త్యాగం చేయలేము. మనం దిసమొలతో ఈ లోకానికి వచ్చాము. దిసమొలతోనే ఈ జగత్తు నుంచి వెళ్ళిపోతాము. జనన మరణాల మధ్యకాలంలో మనం: "ఇది నా దేశం, ఇది నా ఇల్లు, ఈమె నా భార్య, వీరు నా పిల్లలు, ఇది నా ఆస్తీ, ఇది నా బ్యాంకు నిలువ" - అనుకుంటూ అబద్ధపు అధికారాల గురించి చెప్పుకుంటాము. నిజానికి ఇవన్నీ కల్లలే. ఎందుకంటే మనం ఈ లోకానికి వచ్చినప్పుడు వట్టి చేతులతో వచ్చాము. వెళ్ళేటప్పుడు వట్టి చేతులతోనే పోతాము. అందుచేత ఈ భోగానికీ, త్యాగానికీ అర్థం ఏముంటుంది? వాస్తవదృష్టితో చూస్తే వాటికి సరియైన అర్థమే లేదు. భోగం అంటే దొంగతనం, త్యాగం అంటే ఎప్పుడూ మనది కాని దానిని పరిత్యజించడం- అంటే అది ఒకరకమైన ఉన్మాదం లాంటిది అని అర్థం చెప్పవలసి ఉంటుంది.

ఈ విషయంలో శ్రీకృష్ణుడు ఇలా ఆదేశిస్తూన్నాడు : "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"(భ.గీ.18.66). భోగత్యాగాల ఆధారంగా మనం భిన్న భిన్న మతాలను సృష్టించుకొన్నా, వాటినన్నింటినీ పరిత్యజించి శ్రీకృష్ణుణ్ణి శరణుపొందాలని భగవద్గీత ఉపదేశిస్తూంది. భోగభాగ్యాలను అనుభవించడం కాని, పరిత్యజించడం కాని మనచేతిలో లేదు. భగవద్గీతలో తెలిపినట్లుగా, త్యాగం చేయడం అంటే మనం మోసంగా

సొంతం చేసుకున్న వాటిని త్యజించడమే. ఒక అబ్బాయి తన తండ్రి నుంచి వందరూపాయల నోటును తీసుకొని దానిని ఏ విధంగా ఉపయోగించాలో తెలియకపోయినా తన దగ్గర భద్రంగా దాచుకోవడానికి ప్రయత్నిస్తాడు. తండ్రి తన కుమారుణ్ణి : "నాయనా, దయచేసి ఆ డబ్బును నాకివ్వు" అని బ్రతిమాలుతాడు. అది తండ్రి ధనమనీ, దానిని తండ్రి దగ్గర దాయడమే ఉత్తమమనీ అతనికి తెలియదు. దానిని ఎలా ఉపయోగించు కోవాలో కూడా తెలియదు. అలాగే శ్రీకృష్ణుడు : "నీ కర్మలను నా కోసం పరిత్యజించు. నీ ధనాన్నీ ఆస్తినీ నా కోసం పరిత్యజించు" అంటున్నాడు. శ్రీకృష్ణుడు యాచకుడు కాడు. సమస్తం అతనికే చెందుతుంది. కాని, అతడు మనలను చిన్నపిల్లలను చూసినట్లు చూస్తూన్నాడు. శ్రీకృష్ణుడు అడిగినట్లుగా, మనం మనదిగా భావిస్తున్న సర్వస్వాన్ని అతనికి అర్పించడమే త్యాగం. కృష్ణ చైతన్యంలో ఉన్నత స్థితిని అందుకోవడానికి ఇది ఒక మార్గం. పరమ సత్యాన్ని పొందడానికి కఠిన వ్రతానుష్ఠానం, బ్రహ్మచర్యం, సర్వప్రాణుల పట్ల సమాన భావం, దానం అవసరమైనవి. కృష్ణ చైతన్యం ద్వంద్వ(భౌతిక) సత్యాన్ని గురించి పట్టించుకోదు; దాని లక్ష్యం పరమసత్యం. శ్రీమద్భాగవతం(1.1.1)లో వ్యాసదేవుడు పరమసత్యానికి ప్రణామములను అర్పించుతున్నాడు(సత్యం పరం ధీమహి). వ్యాసమహర్షి అశాశ్వతమైన సత్యాలకు గాక పరమ సత్యమునే గౌరవించాడు. ఆ పరమ సత్యాన్ని సాక్షాత్కరింప చేసుకోవడానికి అవసరమైన గుణాలను అభ్యసించడమే బ్రాహ్మణుల కర్తవ్యం.

బ్రాహ్మణులు శుచిత్వం, సత్యవర్తనం, మనోః నిగ్రహం, ఇంద్రియ నిగ్రహం, నిరాడంబరత్వం, వేదాలలో ముఖ్యంగా భగవద్గీత నందు విశ్వాసం అలవరచు కోవడం వంటి అర్హతలను పొందాలి. శ్రీకృష్ణుడు "నేను దేవాదిదేవుణ్ణి" అని చెప్పుకున్నప్పుడు, దానిని మనం అవివేకంతో

కాకుండా పరిపూర్ణ జ్ఞానంతో కూడిన విశ్వాసంతో అంగీకరించాలి. అంతేకాదు, ఆ అంగీకారాన్ని మన దైనందిన జీవితంలో ఆచరణలో పెట్టాలి. ఎవరూ పుట్టుకతోనే బ్రాహ్మణులు కారు. శిక్షణతో, ఆచరణతో, జ్ఞానంతో బ్రాహ్మణు లవుతున్నారు. శ్రీకృష్ణుడు భగవద్గీత (4.13) లో తెలిపినట్లు పుట్టుకతో పనిలేదు. గుణమే ప్రధానం :

*చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః*
*తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్*

"ప్రకృతి త్రిగుణములు మరియు తత్సంబంధిత కర్మల ననుసరించి మానవ సంఘము నందలి నాలుగు భాగములు నాచే సృష్టింపబడినవి. ఈ విధానమునకు నేనే కర్తనైనను మార్పులేని వాడనగుటచే అకర్తను కూడ నేనేయని తెలుసుకొనుము."

ఆచరణం వల్లనే గుణగణాలు పరీక్షించబడుతాయి. కనుక ప్రతి ఒక్కరు బ్రాహ్మణుని గుణాలను అలవరచుకోవడమే కాక బ్రాహ్మణ కర్మలను కూడ ఆచరించాలి. ఒక వ్యక్తి ఇంజనీయరు పట్టాను పొంది దానికి సంబంధించిన పనులను చేయకుండా ఊరకే ఇంట్లో కూర్చుంటే ప్రయోజనం ఏముంటుంది? అదేవిధంగా ఒక బ్రాహ్మణుడు బ్రాహ్మణోచిత కర్మలను చేయకుండా "నేను బ్రాహ్మణుడను" అని చెప్పుకుంటే అతని మాటలకు విలువ ఉండదు. కనుక బ్రాహ్మణుడు కాదలచినవాడు పరబ్రహ్మ అయిన శ్రీకృష్ణుని సేవలో నిరంతరం నిమగ్నుడై బ్రాహ్మణుని వలె కర్మలను ఆచరించాలి.

పరమ సత్యానికి సేవ చేయడం ఎలాగ? "యమేన నియమేన చ." యోగాభ్యాసం ద్వారా దేవాదిదేవునితో సంబంధాన్ని కలిగించు కోవాలి. ఆ యోగాభ్యాసం యమ నియమాలపైన, ఇంద్రియ నిగ్రహమును

ఆచరించడం పైన ఆధారపడి ఉంటుంది. ఇంద్రియ నిగ్రహం లేనిదే నియమ వ్రతాచరణం సాధ్యం కాదు. కనుక వివేకంతో ప్రతివ్యక్తి తనను తాను పవిత్రుణ్ణి చేసుకోవాలి. పరీక్షలలో ఉత్తీర్ణుడు కావాలనుకునేవాడు పాఠశాలకు వెళ్ళాలి. పాఠశాల నియమాలను పాటించాలి. పాఠాలను శ్రద్ధగా చదువాలి. అప్పుడు క్రమంగా కృతార్థుడు కాగలుగుతాడు. రోజంతా వీధులలో ఆటలాడుతూ ఉంటే పరీక్షలలో ఎలా విజయం సాధిస్తాడు? శుకదేవ గోస్వామి వివరించిన పద్ధతి ననుసరించి మొట్టమొదట చేయవలసిన విధి తపస్సు. కఠిన వ్రతాచరణము, బ్రహ్మచర్యము, అదుపాజ్ఞలంటే ఇష్టపడని మనకు కష్టంగానే అనిపిస్తాయి. అయితే మనం నియమాలను ఆచరించడం అలవాటు చేసుకున్నాక అన్నీ సులభంగానే తోస్తాయి.

మనుషులు ధీరులు అధీరులు అని రెండు వర్గాలుగా ఉంటారు. ఎంతటి ఆందోళన కలిగినను, ఎంతగా మనసును చంచలం చేసే పరిస్థితులు ఎదురైనను చలించనివాడు ధీరుడు. కాళిదాసు అనే సంస్కృత మహాకవి తన 'కుమార సంభవం' అను కావ్యంలో పరమశివుణ్ణి ధీరునిగా చూపించాడు. దేవదానవ యుద్ధంలో దేవతలు ఓడిపోవుచున్నప్పుడు, పరమేశ్వర వీర్యసంజాతుడైన సేనాధిపతి దానవులను ఓడించి తమకు రక్షణ కల్పిస్తాడని దేవతలు భావించారు. అయితే ఆ సమయంలో పరమ శివుడు ఘోరతపస్సులో ఉన్నాడు. కాబట్టి, అతని వీర్యాన్ని సంపాదించడం సాధ్యం కాలేదు. అందుచేత పార్వతిని అతని వద్దకు పంపారు. పార్వతి అతనికి లింగపూజ చేసింది. ఆమె అతని ఎదుట కూర్చుని అతని లింగాన్ని తాకి ఆరాధించినా శివుడు తన తపస్సు నుంచి చలించలేదు. "ఒక యువతి అతని నిష్ఠను భగ్నం చేయాలని అతని లింగాన్ని తాకినా కూడా పరమశివుడు చలించలేదు. కనుక ధీరునికి ఉదాహరణ అతడే" అని కాళిదాసు వర్ణించాడు.

అలాగే హరిదాస్ ఠాకూర్ తపోనిష్ఠకు భంగం కలిగించడానికి ఎవరో అతని వద్దకు ఒక వేశ్యను పంపించారు. తనతో సుఖించుమని ఆమె ఠాకూర్‌ని కోరింది. అప్పుడాయన : "నువ్వు చెప్పింది చాలా బావుంది. కూర్చోనుము. నా జపం పూర్తి కానివ్వు. తరువాత మనం సుఖమును అనుభవిద్దాము" అన్నాడు. తెల్లవారింది. ఆమెకు విసుగెత్తింది. హరిదాస్ ఠాకూర్ ఆమెతో : "నేను చాలా విచారిస్తున్నాను. నా జపం పూర్తి చేయలేక పోయాను. ఈ వేళ రాత్రికి రా" అన్నాడు. ఆ వేశ్య వరుసగా మూడురాత్రులు వచ్చింది. మూడవరాత్రి ఆమె అతని పాదాల మీద పడి తన దురుద్దేశాన్ని వెల్లడించింది : "మీ శత్రువు ఒకడు మీ తపోనిష్ఠకు భంగం కలిగించుమని నన్ను ప్రోత్సహించి పంపాడు. దయచేసి నన్ను క్షమించండి" అని వేడుకుంది. అది విన్న హరిదాస్ ఠాకూర్ ఆమెతో: "అదంతా నాకు ముందుగానే తెలుసును. నీవు మారి భక్తురాలవు కాగలవనే అభిప్రాయంతోనే నిన్ను వరుసగా మూడురాత్రులు ఇక్కడకు రానిచ్చాను. ఈ జపమాలను తీసుకొనుము, జపం ప్రారంభించుము. నేను ఈ ప్రదేశమును విడిచి వెళ్ళుచున్నాను" అన్నాడు. దేహాన్ని, వాక్కును, బుద్ధిని నిగ్రహించిన ధీరునికి ఇది మరో ఉదాహరణ. ధీరులు, ధర్మసిద్ధాంతాలు తెలిసినవారు మాత్రమే మనోవాక్కాయ బుద్ధులను నిగ్రహించు కోగలరు.

మనం ఎంతోకాలంగా నిరంతరం పాపకార్యాలను చేస్తూనే ఉన్నాము. ఈ పాపకార్యాలు చేయడం అనేది ఎప్పటినుంచి ప్రారంభమైందో మనకు తెలియదు. మనం చేసిన తప్పులన్నింటినీ సరిదిద్దు కోవడానికే ఈ జీవితం ఉద్దేశించబడింది. పొలంలో అనవసరంగా గల గడ్డినీ గాదాన్నీ నిప్పంటించి కాల్చివేసినట్లు కఠిన వ్రతాచరణం వల్ల, తపస్సు వల్ల మన పాపకృత్యాలన్నీ నశించి మనం పవిత్రుల మవుతాము. శుకదేవ గోస్వామి మరొక మార్గాన్ని (భాగ. 6.1.15) లో సూచించారు :

కేచిత్కేవలయా భక్త్యా వాసుదేవపరాయణాః
అఘం ధున్వన్తి కార్త్స్నేన నీహారమివ భాస్కరః

సాధారణంగా నియమనిష్ఠలతో, బ్రహ్మచర్యంతో, సమస్త జీవుల పట్ల సమభావంతో దానం మొదలైన సుగుణాలతో జీవించేవారినే ప్రజలు పుణ్యపురుషులు అంటున్నారు. కాని ఒకరు కృష్ణ చైతన్యవంతుడు కావడం చేతనే తన పూర్వజన్మ కర్మఫలితాలను గత జీవిత పాపాలను నశింప చేసుకోగలడు. సూర్యుడు ఉదయించగానే పొగమంచు పటాపంచ లవుతుంది. శ్రీకృష్ణుడు వేలవేల సూర్యల కాంతితో ఉదయించి మనలోని పాపాలనే పొగమంచును పారద్రోలుతాడు.

గొప్ప అదృష్టవంతులు మాత్రమే ఈ మార్గాన్ని అనుసరిస్తారు. అందుచేతనే శ్రీల రూప గోస్వామికి శ్రీ చైతన్య మహాప్రభువు : "బ్రహ్మాండ భ్రమితే కోన్ భాగ్యవాన్ జీవ్, గురుకృష్ణప్రసాదే పాయ్ భక్తిలతాబీజ్" - "శ్రీకృష్ణుని మరియు ఆధ్యాత్మికాచార్యుని అనుగ్రహం వలన అదృష్ట వంతుడైన జీవుడు ఎవడో ఒకడు అనేక జన్మలలో విశ్వం అంతటా పరిభ్రమించిన తరువాత శుద్ధమైన భక్తియుక్త భగవత్ సేవా బీజాన్ని పొందుతాడు" అన్నాడు. కృష్ణ చైతన్యం కేవలం గొప్ప అదృష్టవంతులకు మాత్రమే లభిస్తుంది. ఎందుచేతనంటే, కేవలం కృష్ణ చైతన్యమార్గాన్ని అనుసరించడం వల్ల కఠిన వ్రతాచరణం, త్యాగం, బ్రహ్మచర్యం మొదలైన విధులను ఆచరించే వారిని కూడా అధిగమించ గలుగుతాడు. అందుచేతనే శుకదేవ గోస్వామి : "కేచిత్ కేవలయా భక్త్యా" - "పరమ భాగ్యశాలైనవాడే శుద్ధమైన భక్తియుక్త సేవామార్గాన్ని అనుసరిస్తాడు" అని ప్రకటించాడు. "కేవలా భక్తి" అంటే శ్రీకృష్ణుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకోవడం తప్ప మరొక కోరిక ఎరుగని శుద్ధమైన, నిష్కల్మషమైన భక్తియుక్త సేవ అని అర్థం. తనకు రాబడి పెరగాలి అనే కోరికతో భగవంతునికి భక్తియుక్త సేవ

చేయకూడదు. మనకు సుఖంగా ఉండడానికి ధనం కావాలి. కాని, మనం కృష్ణ చైతన్యమార్గాన్ని అవలంబిస్తే ధనం అంటే ఉపేక్షాభావం కలిగే సౌఖ్యాన్ని పొందగలం. అప్పుడు ధనం దానంతటఅదే వస్తుంది; సుఖం కూడా కలుగుతుంది. వాటికోసం ప్రత్యేకంగా శ్రమపడవలసిన అవసరం లేదు.

"భౌతిక ప్రయోజనాన్ని ఆశించి భగవంతునికి భక్తియుక్త సేవను చేశాను. నేనెంత మూర్ఖుణ్ణి!" అని ధ్రువమహారాజు విలపించాడు. సాధారణంగా భౌతిక ప్రయోజనాన్ని ఆశించేవాడు తన పై అధికారినో, ఒక ఐశ్వర్యవంతుణ్ణో, లేక ఏ దేవతనో అర్థించడానికి వెళ్తాడు. కాని భక్తుడు మాత్రం భౌతిక వాంఛలకోసమైనా కూడా శ్రీకృష్ణుని వద్దకు తప్ప మరొక చోటికి వెళ్ళడు. ఒకవేళ భౌతిక ప్రయోజనం కోసం శ్రీకృష్ణుణ్ణి సేవించినా, ధ్రువమహారాజు వలే ఏనాటికైనా అతడు భౌతిక వాంఛలను విస్మరిస్తాడు. ధ్రువమహారాజు పశ్చాత్తప్తుడైనప్పుడు : "నేను శ్రీకృష్ణుని వద్దకు వచ్చి, గొప్ప ధనవంతుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకొని కేవలం గుప్పెడు బియ్యపు గింజలను అడిగినట్లు, ఏవో భౌతిక వస్తువులను యాచించాను" అని భావించాడు. మనం కోరినదెల్లా ఇవ్వడానికి ధనవంతుడు అంగీకరించినప్పుడు గుప్పెడు బియ్యపు గింజలను కోరడం వివేకమా? భౌతిక లాభాల కోసం శ్రీకృష్ణుణ్ణి యాచించడం సరిగ్గా అలాంటిదే. కేవలం భౌతిక సుఖాల కోసం శ్రీకృష్ణుణ్ణి ఆశ్రయించ నక్కరలేదు. ఎందుచేతనంటే, భౌతిక సుఖాలు వాటంతట అవే : "దయచేసి నన్ను స్వీకరించు. దయచేసి నన్ను స్వీకరించు" అంటూ మన పాదాల వద్దకు దొర్లి వస్తుంటాయి.

కృష్ణ చైతన్యాన్ని అనుసరించే వారికి కృష్ణానుగ్రహం కలిగి భౌతిక సంపదలు, ఆలుబిడ్డలు, సుఖం, ఇల్లూ వాకిలీ అన్నీ అడుగకుండానే లభిస్తాయి. కాబట్టి వారు వాటికోసం ప్రయత్నించ నవసరం లేదు. వారు

ప్రార్థించ వలసినదెల్లా : "నన్ను నీ సేవలో ఉండనివ్వు" అని మాత్రమే. తన సేవలో నిమగ్నుడైన వాని అవసరాలను తానే తీరుస్తాననీ, వారి వద్దనున్న వాటిని తానే రక్షిస్తాననీ భగవద్గీత (9.22) లో శ్రీకృష్ణుడు వాగ్దానం చేశాడు. పూర్తిగా తన మీదనే ఆధారపడి ఉండాలనేది శ్రీకృష్ణుడు అర్జునునికి ఇచ్చిన ఆదేశాలలో ఒకటి :

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ

"సర్వకర్మల యందు నా పైననే ఆధారపడి సదా నన్నే నీ గమ్యముగా ఎంచి కర్మ నొనరింపుము. అట్టి భక్తియుక్త సేవలో సంపూర్ణముగా నా యందే చిత్తము కలవాడవగుము." (భ.గీ. 18.57)

# 6. ఉపాధులను, సమస్యలను అధిగమించడం

శ్రీ చైతన్య మహాప్రభువు అనుగ్రహం వలన మనం కృష్ణ చైతన్యాన్ని సులభంగానే పొందగలము. ఆయన శిష్యపరంపరలో చేరే భాగ్యం కూడా ఆయన అనుగ్రహం వల్లనే కలుగుతుంది. అది కూడ ఎవరో కొంధరు అదృష్టవంతులకే లభిస్తుంది. భగవద్గీత (7.3) ప్రకారం :

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః

"పెక్కు వేల మానవులలో ఒక్కడు మాత్రమే పరమ సిద్ధిని సాధించుటకు ప్రయత్నించును. ఆ విధముగా పరమ సిద్ధిని సాధించిన వారిలో కూడా ఒకానొకడు మాత్రమే నన్ను యథార్థముగా తెలుసుకొన గలుగుచున్నాడు."

పశువులకూ, పశువుల వంటి మనుషులకూ, మానవ రూపంలో కల పశువులకూ భగవత్ సాక్షాత్కారం సాధ్యం కాదు. ఇంతకు ముందు పేర్కొన్నట్లు ఆధునిక నాగరిక సమాజం పశులక్షణాలు అలవాటు చేసుకుని వ్యవహరిస్తూ ఉంది. కాబట్టి దానిని పశువుల సమూహంగా పరిగణించ వచ్చును. పక్షులు, పశువులు తెల్లవారు జామున నిద్రలేచింది మొదలు ఆహార నిద్రా భయ మైథునాలలోనే నిమగ్నమై ఉంటాయి. అవి రాత్రులలో తలదాచు కోవడానికి ప్రయత్నిస్తాయి. తిరిగి ఉదయం గింజలు పళ్ళూ సంపాదించడానికి చెట్లు ఎక్కుతాయి. అదేవిధంగా న్యూయార్క్ పట్టణంలోని ప్రజలు కూడా తమ ఆహారం కోసం తండోపతండాలుగా ఒక దీవి

నుంచి మరో దీవికి ప్రయాణం చేయడమో లేక కార్యాలయాలకు వెళ్ళడానికి భూగర్భమార్గాలలో వేచి ఉండటమును చూస్తుంటాము. ఇది పశుజీవితం కంటె ఏ విధంగా మెరుగుగా ఉంది? పడవలు, భూగర్భమార్గాలు క్రిక్కిరిసి ఉన్నా, ప్రజలు ఆహారం కోసం నలభై యాభై మైళ్ళదూరం ప్రయాణం చేయవలసి వస్తుంది. పక్షులు ఒక చెట్టు మీద నుంచి మరొక చెట్టు మీదికి ఎగిరి ఎంతో సులభంగా ఆహారాన్ని సంపాదిస్తాయి.

పశుపక్ష్యాదులవలే కేవలం భౌతికావసర వస్తువులను సంపాదించడం వరకే పరిమితమైన మానవ నాగరికత నిజమైన నాగరికత కాదు. మానవునికి పరమపిత అయిన భగవంతునితో కల సంబంధాన్ని అతడు తెలుసుకోవడానికి సహాయం చేసేదే నిజమైన నాగరికత. మనిషి తనకూ భగవంతునికీ కల సంబంధాన్ని క్రైస్తవ మతగ్రంథాల నుంచికాని, వైదిక సాహిత్యం నుంచికాని, ఇస్లాము మత గ్రంథమైన ఖురాను నుంచికాని ఏ మార్గం నుండి అయినను తెలుసుకోవచ్చును. ఏది ఏమైనా దానిని గురించి తప్పక తెలుసుకోవాలి. క్రైస్తవులను హిందువులుగా మార్చడం, హిందువులను క్రైస్తవులుగా మార్చడం కాదు. తనకు భగవంతునితో గల సంబంధాన్ని తెలుసుకోవడమే మానవుని ముఖ్య కర్తవ్యమని ప్రతివారికీ తెలియ చెప్పడమే ఈ కృష్ణ చైతన్యోద్యమ ముఖ్య ఉద్దేశ్యం. ప్రతివాడూ ఈ విజ్ఞానాన్నీ అలవరచుకోవాలి. అలాకాక పశుపక్ష్యాదుల వలే ఆహారము, నిద్ర, భయం, మైథునాలతో తృప్తిపడుతూ ఉంటే వారు కాలాన్ని వృథా చేస్తున్నారని అర్థం. మనమందరం శ్రీకృష్ణుణ్ణి లేక భగవంతుణ్ణి ప్రేమించడానికి ప్రయత్నించాలి. అలా ప్రేమించడానికి ఏదైనా మార్గం తెలిస్తే దానిని ఆచరించాలి. అలాంటి మార్గం ఏదీ తెలియని వారు కృష్ణ చైతన్య సంఘానికి వచ్చి అటువంటి మార్గాన్ని తెలుసుకోవచ్చును. మార్గాన్ని ఎన్నుకోవడంలో అసూయాద్వేషాలకు ఏ మాత్రం అవకాశం ఇవ్వరాదు.

విషాదస్యమృతం గ్రాహ్యమమేధ్యాదపి కాంచనమ్
నీచాదప్యుత్తమాం విద్యాం స్త్రీరత్నం దుష్కులాదపి

మంచిని ఎక్కడ నుండైనా సరే గ్రహించాలని చాణక్య పండితుడు తెలిపాడు (నీతి దర్పణం 1.16). ఒక విషపు పాత్రలో ఎంత కొంచెం అమృతం కలిసి ఉన్నా ఆ అమృతలేశాన్ని గ్రహించి విషాన్ని విడిచిపెట్టాలని అతడు అంటున్నాడు. అలాగే అశుద్ధములో పడినా బంగారాన్ని తీసుకోవాలి, వైదిక విద్యావిధానంలో పండితుడైన బ్రాహ్మణుడే సూచనలను చేయాలనే నియమం ఉన్నప్పటికినీ, సంఘంలో తక్కువవాడైనను పరమ సత్యమును ఎరిగినట్లయితే, అతనిని గురువుగా భావించి అతని నుండి జ్ఞానాన్ని పొందవచ్చుననీ, తత్త్వవేత్త హీనకులజుడు కనుక అతనిని గురువుగా అంగీకరించరాదని తలచకూడదనీ అతడు చెప్పాడు.

అలాగే భగవంతుణ్ణి అవగాహన చేసుకోవడానికి అధికాసక్తి కలవాడు : "నేను క్రైస్తవుణ్ణి, నేను హిందువును లేక నేను ముస్లిమును" అని భావించరాదు. భగవత్ ప్రేమను గురించి తెలుసుకోవాలనే ఆసక్తి కలవాడు తనకు ఏ మార్గం ఆచరణ సాధ్యమో ఆలోచించాలి. "నేను హిందూ మతాన్ని కాని వైదిక గ్రంథాలను కాని ఎందుకు అనుసరించాలి ?" అని ఆలోచించకూడదు. భగవంతుని పట్ల ప్రేమను అభివృద్ధి చేసుకోవడమే వైదిక గ్రంథాలను అనుసరించడంలోని ఉద్దేశ్యం. ఉన్నత విద్యకోసం విదేశాలకు వెళ్ళాలనుకునే విద్యార్థులు తమ ఆచార్యులు అమెరికా దేశస్థులా, జర్మనీ దేశస్థులా, మరోదేశం నుంచి వచ్చినవారా అనే విషయమును ఆలోచించరు. ఉన్నత విద్యను అభ్యసించాలనుకునే వారు అమెరికాకు వెళ్తారు. విద్య నేర్చుకుంటారు. అంతే. అదేవిధంగా భగవంతుణ్ణి తెలుసుకొని, అతడిని సమీపించడానికి కృష్ణ చైతన్యంలాంటి శక్తివంతమైన మార్గం ఉంటే కనుక దానిని అనుసరించాలి.

వివేకవంతులు, అదృష్టవంతులైన వారు మాత్రమే ఈ భక్తియుక్త భగవత్ సేవామార్గాన్ని అనుసరిస్తారు కాని(కేవలయా భక్త్యా) అందరూ కాదు. శ్రీకృష్ణుని సేవించడమే వారి ఏకైక వాంఛ. ఆ భక్తులు తెల్లవారు జాము నుంచి రాత్రి చాలా పొద్దుపోయే వరకూ శ్రీకృష్ణుని సేవలోనే నిమగ్నులై ఉంటారు. ఇదే 'కేవలయా' – అంటే పవిత్రమైన భక్తి. వారికి శ్రీకృష్ణుని సేవ తప్ప మరొక వ్యాపకం లేదు. ఇది అందరూ అనుసరించ దగిన మార్గం. ఇదే పరమ ధర్మం. *(స వై పుంసాం పరో ధర్మో యతో భక్తి రధోక్షజే.)* సంస్కృత భాషలో 'పర', 'అపర' అనే రెండు మాటలున్నాయి. 'పర' అంటే ఉత్తమమైనది(గుణాతీతమైనది), 'అపర' అంటే న్యూనమైనది (భౌతికమైనది). ఈ రెండు పదాలు ధర్మం పట్ల ఉత్తమ, న్యూన దృక్పథాలను తెలుపుతున్నాయి. భౌతిక ప్రయోజనాల కోసం నిర్వర్తించే భౌతిక ధర్మం లేక మతం ప్రకారం ప్రజలు సాధారణంగా చర్చికో, దేవాలయానికో వెళ్ళి : "భగవంతుడా, నాకు దైనందినా ఆహారాన్ని ప్రసాదించు" అని ప్రార్థిస్తారు. వాస్తవానికీ ప్రతివాడి ఆహారం ఏర్పాటు చేయబడే ఉంది. కనుక, ఆహారం కోసం ప్రత్యేకంగా భగవంతుణ్ణి ప్రార్థించ నవసరం లేదు. పక్షులు పశువులు దేవాలయానికో చర్చికో వెళ్ళి ఆహారం కోసం భగవంతుణ్ణి ప్రార్థించకుండానే ఆహారాన్ని పొందగలుగు తున్నాయి. ఆ విధంగానే మనం చర్చికి గాని దేవాలయానికి గాని వెళ్ళినా వెళ్ళకపోయినా మనకోసం ఆహారం ఏర్పాటు చేయబడే ఉంటుంది. కేవలం, తిండిలేక పోవడం వలన వీధులలో ఎవరూ మరణించడం లేదు. పశుపక్ష్యాదులు కూడా ఆఖరికి చీమవంటి పురుగు కూడా తిండిలేక పస్తులతో మాడి చనిపోవడం లేదు. కాబట్టి తిండి ఒక సమస్యయే కాదు. అందరికీ ఆహారం ఉంది. దానికోసం ఎవరూ బాధ పడనవసరం లేదు. మనం మన మేధస్సును ఆలోచనలతో శ్రమపెట్టవలసి వస్తే శ్రీకృష్ణుని కోసమో

లేక భగవంతుని కోసమో శ్రమపెట్టాలి. మన కాలాన్ని సముచితంగా ఉపయోగించడం అంటే అదే. భగవంతుని సామ్రాజ్యంలో ఆహారానికి కొరతే లేదు.

తస్యైవ హేతోః ప్రయతేత కోవిదో
న లభ్యతే యద్భ్రమతాముపర్యధః

అని శ్రీమద్భాగవతం (1.5.18) లో తెలుపబడింది : ప్రపంచంలో నాలుగు దిక్కులలో పర్యటించినా, ఏది లభించదో దానిని పొందడానికి మాత్రమే మానవుడు ప్రయత్నించాలి. అది ఏమిటి? 'కేవలయా భక్త్యా' శుద్ధభక్తి. భగవంతుడు చేసిన ఏర్పాట్లవల్ల ఈ లోకంలో అంటే భూలోకంలో తగినంత భూమి, ఆహారమును బాగా పండించడానికి తగిన అవకాశాలు ఉన్నాయి. అయితే మనం స్వయంగా చేసుకున్న ఏర్పాట్ల వల్లనే ప్రపంచంలో ఒకచోట ప్రజలు ఆహారం లేక బాధపడడం, మరొకచోట ఆహార ధాన్యాలను సముద్రంలో వృథాగా పారబోయడం జరుగుతూంది. "ఏకో బహూనాం యో విదధాతి కామాన్" - దేవాదిదేవుడు ప్రాణికోటికి ఆహారాన్ని సమకూర్చు తున్నాడు అని వేదాలు చెబుతున్నాయి. ఈ భౌతిక ప్రపంచంలో గల చిక్కు ఏమిటంటే కొందరు తమ అవసరానికి మించి ఆహారధాన్యాలను నిలువచేసి అనేక సమస్యలను సృష్టిస్తున్నారు. రాజకీయ వేత్తలనబడే వారి నాయకత్వంలో కొందరు ప్రజలు సమస్యలను సృష్టిస్తున్నారు. ప్రకృతి విధానాన్ని లేక భగవంతుని విధానాన్ని అనుసరించి ప్రతివస్తువూ పరిపూర్ణంగా ఉంది. ఈశోపనిషత్తు(మంగళాచరణం) ప్రకారం :

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే

"దేవాదిదేవుడు సమగ్రుడూ, సంపూర్ణుడై ఉన్నాడు. అతడు సర్వ సంపూర్ణుడవడం చేత అతని నుండి ఉద్భవించిన ఈ దృశ్యమాన జగత్తు మొదలైనవన్నీ సర్వసంపూర్ణాలై ఉన్నాయి. సంపూర్ణం నుండి వెలుబడింది ఏదైనా తనంతతాను సమగ్రమై ఉంటుంది. అతడు సర్వ సంపూర్ణుడవడం చేత అతని నుండి అనేక సంపూర్ణాంశలు ఉద్భవించినా అతడు సర్వ సంపూర్ణుడుగానే ఉంటాడు." భగవంతుడు సంపూర్ణుడు; అతని సృష్టి కూడా సంపూర్ణం. అతని ఏర్పాట్లు సంపూర్ణమైనవే కాని మనమే చిక్కులు కలిగిస్తున్నాము. ప్రజలను కృష్ణ చైతన్యవంతులను చేసేదే నిజమైన విద్య. తద్వారా ప్రజలు భూమిమీద గల సహజ సంపదను సక్రమంగా వినియోగించుకుని ఎటువంటి సమస్యలు ఏర్పడకుండా చేయగలరు. ఐక్యరాజ్య సమితిలో తీర్మానాలు ఆమోదించినంత మాత్రాన సమస్యలు పరిష్కారం కావు. సమస్యలను పరిష్కరించడానికి అసలైన పద్ధతి ఏదో తెలుసుకోవాలి.

కేవలం శుద్ధమైన భక్తియుక్త సేవ ద్వారానే జీవిత సమస్యలను పరిష్కరించ గలమని శుకదేవ గోస్వామి చెబుతున్నాడు. దీనిని ఎవరు ఆచరించ గలరు? సామాన్య మానవులకు సాధ్యం కాదు : 'వాసుదేవ పరాయణాః' – వాసుదేవుడైన శ్రీకృష్ణుని భక్తులకు మాత్రమే సాధ్యం అవుతుంది. శ్రీకృష్ణుణ్ణి సంతృప్తిపరచడమే పరమలక్ష్యంగా భావిస్తూ శుద్ధమైన భక్తియుక్త సేవను చేసేవారే జీవిత సమస్యలను, పరిష్కరించ కోగలరు.

'అఘం ధున్వంతి'– ఇదివరకే వివరించినట్లు, మన పాపకృత్యాల వల్లనే సమస్యలు ఏర్పడుతున్నాయి. కావలసినంత ఆహార పదార్థాలు ఉన్నప్పటికీ ప్రతివాడూ లాభం గడించడానికో లేక నిలువ చేసే స్వభావం వల్లనో తన అవసరాలకు మించి నిలువ చేస్తున్నారు. 1942లో భారత దేశంలో కొందరు అనవసరంగా ధనాన్ని, ఆహార పదార్థాలనూ కూడబెట్టి

కృత్రిమమైన కరువును సృష్టించారు. కొందరు ధనవంతులు పన్నెండు రుపాయలకు ఒక కేజి అమ్ముతూన్న బియ్యాన్ని అక్రమంగా నిలువచేయడం వల్ల హఠాత్తుగా ఒకవారంలోనే బియ్యం ధర వంద రూపాయలకు పెరిగి పోయింది. దాని ఫలితంగా బజారులో బియ్యం గింజలే కనబడకుండా పోయాయి. ప్రజలు ఆకలితో అలమటించారు. అప్పుడు భారతదేశంలో గల ఒక అమెరికా దేశస్థుడు : "మా దేశంలో ప్రజలు ఈ విధంగా ఆకలితో మాడినట్లయితే ఒక విప్లవమే వచ్చి ఉండేది" అని వ్యాఖ్యానించాడు. కాని భారతదేశంలోని ప్రజలు క్రమశిక్షణ గల సంస్కార హృదయులు గనుక కృత్రిమ క్షామం ఏర్పడినా 'తిరుగుబాటు చేయడం కన్న ప్రశాంతంగా మరణించడమే మంచిది' అని భావించారు. సమస్యలను సృష్టించేది భగవంతుడు కాదనీ మనుషులేననీ చెప్పడానికి ఇది ఒక చక్కని ఉదాహరణ. మొదటి ప్రపంచ యుద్ధసమయంలో స్త్రీలందరు చర్చిలకు వెళ్ళి తమ భర్తలను, కుమారులను, సోదరులను సురక్షితంగా ఇంటికి తిరిగి వచ్చేటట్లు చేయుమని భగవంతుణ్ణి ప్రార్థించారు. కాని ఒక్కరు కూడా యుద్ధ భూమి నుంచి సురక్షితంగా తిరిగి రాలేదు. అందుచేత ఆ స్త్రీలంతా నాస్తికులై పోయారు. భగవంతుడు యుద్ధాన్ని గాని దాని వల్ల కలిగే సమస్యలను కాని సమర్థించడని వారు ఆలోచించనే లేదు. పరిష్కారం కోసం మాత్రం వారు భగవంతుణ్ణి ప్రార్థించారు. మనంతట మనమే సమస్యలను సృష్టించు కుంటున్నప్పుడు వాటి ఫలితాన్ని అనుభవించక తప్పదు.

అయితే, శ్రీకృష్ణుణ్ణి లేక భగవంతుణ్ణి ఆశ్రయించిన వారి సమస్యలు పరిష్కారం అవుతాయన్న మాట మాత్రం నిజం. అందుచేతనే మానవుడు దేవాదిదేవుడైన శ్రీకృష్ణుణ్ణి భక్తితో సేవించాలి. "వాసుదేవే భగవతి భక్తియోగః ప్రయోజితః." వాసుదేవుణ్ణి భక్తియుక్త సేవతో కొలిచేవాడు వెంటనే ఉత్తమోత్తమ జ్ఞానాన్ని పొందుతాడు(జనయత్యాశు వైరాగ్యమ్). జ్ఞానం,

వైరాగ్యం అనే మాటలు "మానవుడు భౌతిక విషయాలపట్ల అనాసక్తుడు కాగల జ్ఞానాన్ని" గురించి తెలుపుతున్నాయి. జ్ఞానం అంటే వివేకం. వైరాగ్యం అంటే అనాసక్తి. మనిషి జీవితానికి జ్ఞానవైరాగ్యాలు రెండూ అవసరమే. "నేను ఆత్మను. ఈ భౌతిక లోకంతో నాకెలాంటి సంబంధం లేదు. కాని, ఈ భౌతిక భోగాలను వివిధ రకాలుగా అనుభవించాలనే కోరిక ఉండడం వల్లనే ఒక దేహం నుంచి మరొక దేహానికి మారుతూ అనేక జన్మలను ఎత్తుతున్నాను. ఇది ఎప్పుడు ప్రారంభమైందో తెలియదు కాని ఇంకా కొనసాగుతూనే ఉంది" అని తెలుసుకోవడమే నిజమైన జ్ఞానం. తన నిజస్థితి ఏమిటో తెలుసుకొని, ఈ భౌతిక ప్రపంచంలో తాను ఎలా కష్టపడుతున్నాడో గ్రహించేవాడే నిజమైన జ్ఞాని. అలాంటి పరిపూర్ణమైన జ్ఞానం వాసుదేవ పరాయణుడైనప్పుడే కలుగుతుంది. భగవద్గీత (7.19) లో శ్రీకృష్ణుడు అర్జునుడికి ఇలా చెబుతున్నాడు :

బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః

"జ్ఞానవంతుడైనవాడు బహు జన్మమృత్యువుల పిదప నన్నే సర్వకారణములకు కారణునిగను మరియు సమస్తముగను తెలుసుకొని నన్ను శరణుజొచ్చును. అట్టి మహాత్ముడు అతి దుర్లభుడు." అన్నింటికీ వాసుదేవుడైన శ్రీకృష్ణుడే కారణమని పరిపూర్ణంగా తెలిసిన మహాత్ములు చాలా అరుదుగా ఉంటారు. పొడుగాటి గడ్డాలు, మీసాలు పెంచి, భగవంతునితో చాలా సన్నిహితంగా ఉన్నామనీ, మరణానంతరం తాము తిరిగి మేలుకొని భగవంతులము అవుతామనీ తాము మహాత్ములమనీ ప్రగల్భాలు పలికే వారిని చాలామందిని మనం చూస్తూంటాము. వారు నిజమైన మహాత్ములు కారు; ఎందుకంటే వారు శ్రీకృష్ణుని న్యాయమైన స్థానాన్ని దురాక్రమణ చేసి అతనితో సమానం

కావాలను కుంటున్నారు. కనుక వారు నిజంగా దురాత్ములు, కఠిన హృదయులు. ఒక కార్యాలయంలో సేవకుడుగా పని చేస్తున్నవాడు యజమానుని స్థానాన్ని ఆక్రమించడానికి ప్రయత్నిస్తే యజమాని ఇష్టపడతాడా? ఆ విధంగానే ఏ జీవి అయినా భగవంతు డవడానికి ప్రయత్నిస్తే భగవంతుడు ఇష్టపడడు. నిజానికి ఎవరూ కూడా భగవంతుడు కాలేరు. మనం భగవంతు డవడానికో లేక భగవంతుని ప్రతిస్పర్ధి అవడానికో ప్రయత్నించడం భగవంతునికి నచ్చదు. అటువంటి ప్రయత్నాలు చేసే వారిని భగవద్గీత (16.19) 'ద్విషతః' – అసూయాపరులని వర్ణిస్తూ ఉంది. భగవంతుడు ఇలా చెబుతున్నాడు :

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు

"అసూయ గలవారును, క్రూరులును అగు నరాధములను వివిధ ఆసుర జన్మలనెడి సంసార సాగరమున నేను శాశ్వతముగా పడద్రోయు చున్నాను."

భగవంతుని స్థానాన్ని చూసి ఈర్ష్య చెందేవారు నరక కూపంలో పడుతారు. వారు ముందుగా ఈ భౌతిక ప్రపంచంలో ఉన్నత పదవులను ఆక్రమించడానికి ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నం ఫలించనప్పుడు : "ఇప్పుడు నేను భగవంతుని స్థానాన్ని ఆక్రమించు కుంటాను" అని భావిస్తారు. కాని మనిషి భగవంతుడు కాడు కనుక ఆ కోరిక కూడా నిష్ఫలం అవుతుంది. భగవంతుడు భగవంతుడే, జీవాత్మ జీవాత్మయే. భగవంతుడు అసమానుడు, అనంతుడు. మనం అంశాణువులము. మన స్థానం భగవంతునికి సేవ చేయడమే. మనస్థానాన్ని బట్టి మనం ప్రవర్తిస్తేనే మనం సుఖంగా ఉంటాము. భగవంతుణ్ణి అనుకరించడం వల్ల సుఖం కలుగదు. "యస్యైక

నిశ్శ్వసితకాలమథావలంబ్య జీవంతి లోమవిలజా జగదండనాథాః" (బ్రహ్మ సంహిత, 5.48). ఈ బ్రహ్మాండంలో లెక్కలేనన్ని విశ్వాలు ఉన్నాయి. ఈ విశ్వాలు మహావిష్ణువు నిశ్వాసంతో అతని ఉదరంలోనికి వెళ్ళి వినాశనమవుతాయి. పరిస్థితి అలా ఉన్నప్పుడు మానవ మాత్రుడు భగవంతుడెలా అవుతాడు? భగవంతుడు అంత సులభంగా కూడా లభించడు. కాబట్టి మనం జ్ఞానమార్గంలో పయనించి వాసుదేవుడైన శ్రీకృష్ణుణ్ణి సర్వోత్తమునిగా అంగీకరించాలి. శ్రీకృష్ణుడు మనలాంటి మానవ మాత్రుడు అంటే కుదరదు. అతడు భూమిమీద ఏ దశలోనూ సాధారణ మానవునిలా కనిపించలేదు. బాల్యంలో కూడా సామాన్య మానవుల శక్తులకు అతీతమైన గొప్ప అద్భుతాలను ప్రదర్శించాడు. శ్రీకృష్ణుడికి శరణాగతుడవడం అంటే ఏదో సామాన్య మానవుడికి శరణాగతి చేయడం లాగ భావించరాదు. దేవాదిదేవుడైన పురుషోత్తముణ్ణి శరణు పొందు చున్నాము. ఈ విషయాన్ని వైదిక సారస్వతం అంతా ధ్రువపరుస్తోంది. 'అఘం ధున్వంతి' - శ్రీకృష్ణుణ్ణి శరణుపొందడం వల్ల మనం సకల పాపకర్మఫలితాల నుంచీ విముక్తుల మవుతున్నాము. తనను శరణు వేడుమని భగవద్గీత (18.66)లో శ్రీకృష్ణుడు మానవు లందరికీ ఉపదేశిస్తున్నాడు :

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః

"సర్వవిధములైన ధర్మములను విడిచి కేవలము నన్నే శరణు పొందుము. నేను సమస్త పాప ఫలితముల నుండి నిన్ను విడిపింతును, భయము నొందకుము."

కాబట్టి శ్రీకృష్ణుని భక్తియుక్త సేవలో నిమగ్నుడయ్యే భక్తుడు(వాసుదేవ

పరాయణాః) అన్ని పాపకర్మల ఫలితాల నుంచీ వెంటనే విముక్తుడవుతాడు. కేవలం, ఊహాకల్పనల చేత శ్రీకృష్ణునికి భక్తియుక్త సేవ కాని, కృష్ణ చైతన్యం కాని పొందడం సాధ్యం కాదు. కృష్ణభక్తుని అవ్యాజ కృపాకటాక్షం వలన మాత్రమే అది సాధ్యం కాగలదు. పతితుల పట్ల కృపతో మహాత్ముడు ఇచ్చిన అద్వితీయ వరప్రసాదం ఇది. శ్రీకృష్ణుని అనుగ్రహం వలన మాత్రమే గురువు లభిస్తాడనీ, ఆ గురువు కృప వల్ల శ్రీకృష్ణుణ్ణి పొందగలమనీ చెప్పబడి ఉంది. ఈ వరం సూర్యోదయం లాంటిది. రాత్రులలో లక్షలమైళ్ళ వరకూ దట్టంగా అంతటా అలముకొన్న చీకట్లు సూర్యుడు ఉదయించగానే పటాపంచలై పోతాయి. ఆ విధంగానే మన హృదయాలలో శ్రీకృష్ణుడనే సూర్యుణ్ణి ఉదయింప చేసుకోవడానికి ప్రయత్నిస్తే మన సమస్యలన్నీ పరిష్కారం అవుతాయి.

K. Nagabhushana Rao
B. Com:
A. P. TRANS Co.; Ltd:

85

# 7. కృష్ణ చైతన్యంలో ముక్తియే : అద్వితీయ వరప్రసాదం

మనం ఆదిపురుషుణ్ణి ఆరాధించి నట్లయితే(ఆది పురుషం) ఇతరులు మనలను పెడత్రోవ పట్టిస్తారేమోనని భయపడవలసిన అవసరం లేదు. "మానవుడు కేవలం భక్తియుక్త సేవతోనే జీవిత పరిపూర్ణత్వమును సాధించ గలడు(కేవలయా భక్త్యా)" అని శ్రీమద్భాగవత మూలవ్యాఖ్యాత శ్రీధరస్వామి వివరించాడు. ఎవరు కూడ ఇతర మార్గాలపై ఆధార పడవలసిన అవసరం లేదు. కేవలం భక్తిమార్గం వల్లనే భౌతిక జీవితానికి స్వస్తి చెప్పవచ్చునని (కేవలయా) శుకదేవ గోస్వామి చెబుతున్నాడు. మొదట తపస్సు, కఠిన వ్రతానుష్ఠానం, తరువాత బ్రహ్మచర్య వ్రతమును అవలంబించడం, మనస్సునూ ఇంద్రియాలనూ నిగ్రహించడం, దానం, త్యాగం, సత్యవ్రత నిష్ఠ, యజ్ఞహోమాలు, శుచి జీవితం మొదలైన వాటి అవసరమే లేదు. కేవలం ఒకే ఒక దెబ్బతో అంటే కృష్ణ చైతన్యంతో - ఎవరైనను అతి త్వరలోనే అత్యున్నత స్థానాన్ని అధిష్ఠించగలరు. కేవలం కృష్ణ చైతన్య మార్గాన్ని అనుసరించడం వల్ల ఆధ్యాత్మికంగా అన్ని అర్హతలూ చేకూరుతాయి. స్వర్ణకారుడు చిన్నసుత్తితో బంగారాన్ని అనేక పర్యాయాలు కొట్టికొట్టి తనకు కావలసిన ఆకారానికి సాగదీస్తాడు. కమ్మరి పెద్ద సమ్మెటతో ఒకే ఒక దెబ్బ కొట్టి తనపనిని పూర్తి చేసుకుంటాడు. అది కమ్మరి పద్ధతి. మనది పెద్ద సమ్మెట పనిలాంటిది; మనం భక్తియోగ అనే పెద్ద సమ్మెటతో భౌతిక జీవితాన్ని అంతం చేస్తాము. చిన్నచిన్న ఇతర మార్గాలను అనుసరించ వలసిన పని లేదు. నిజానికి పరిపూర్ణత్వము కోసం ఇతర వైదిక పద్ధతులను

అనుసరించవలసిన అవసరం కూడా ఉండదు. ఉదాహరణకు హఠయోగం: "నైష్ఠిక బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబించాలి. అడవికి వెళ్ళి నడుము వంచకుండా నేలమీద నిటారుగా కూర్చుని నాసికాగ్రాన్ని వేళ్ళతో నొక్కి పట్టి ఆరునెలలు తపస్సు చేయాలి" అని ఆదేశిస్తూ ఉంది. అలాంటి ఆదేశాలను ఎవరు పాటించగలరు? ప్రస్తుత యుగంలో ఈ పద్ధతి ఆచరణ సాధ్యం కాదు. కాబట్టి స్వర్ణకారుని పద్ధతిని విడిచిపెట్టక తప్పదు. పరిష్కారమార్గం ఏమిటంటే కమ్మరి పద్ధతిని అవలంబించి పాపకర్మ ఫలితాన్ని వెంటనే రూపుమాపు కోవడమే.

మానవుడు భక్తియుక్త సేవతో 'వాసుదేవ పరాయణుడు' కావాలి. అంటే కృష్ణభక్తిలో సంపూర్ణంగా నిమగ్నుడు కావాలి. మరోమాటలో చెప్పాలంటే శ్రీకృష్ణుని ప్రేమను సంపాదించడం ఎలాగో మనం నేర్చుకోవాలి. కృష్ణ చైతన్యాన్ని అవలంబిస్తే ఈ లోకంలో తప్పకుండా శాంతి ఏర్పడుతుంది. ప్రస్తుతం ఈ భూలోకం త్వరత్వరగా నరకలోకం అవుతుంది. కృష్ణ చైతన్య మార్గాన్ని అవలంబించకపోతే ఆర్థికాభివృద్ధి, విద్యాభివృద్ధి ఎంతగా పురోగమించినను ఈ నరకపూరిత పరిస్థితులు ఇంకా పెరుగుతూనే ఉంటాయి. కనుక బుద్ధిమంతులు ఈ ఉద్యమాన్ని ఆసక్తితో అవలంబించి దీని విలువను గుర్తించాలి. ఇది ఎవరో ఒక వ్యక్తికాని, ఒక శిష్యబృందం కాని సృష్టించినటు వంటిది కాదు. ఇది అనేక వేల సంవత్సరాల నుంచి ఉన్న వైదిక సాహిత్యం ఆధారంగా గల అతి ప్రాచీనమైన ప్రామాణిక మార్గం.

'నీహారమివ భాస్కరః' – భాస్కరుడంటే సూర్యుడు. సూర్యుడు వెంటనే చీకట్లను పారద్రోలినట్లే పొగమంచును కూడా పటాపంచలు చేస్తాడు. ఇంతకుముందు చెప్పినట్లు, మనం మన హృదయాలలో కృష్ణభానుణ్ణి ఉదయింప చేసుకోవాలి. శ్రీకృష్ణుడు సూర్యునివంటి వాడనీ, మాయ

అంధకారం వంటిదనీ 'శ్రీ చైతన్య చరితామృతం'లో వివరించబడింది : "యాహాఁన్ కృష్ణ, తాహాఁన్ నాహి మాయార్ అధికార్" - కృష్ణసూర్యుడు ఉదయించిన వెంటనే మాయాంధకారం అదృశ్యం అవుతుంది. మాయాంధకార సముద్రాన్ని దాటాలంటే ఈ కృష్ణ చైతన్యమార్గాన్ని అనుసరించి తీరాలి. లేకపోతే చాలా కష్టం. శ్రీకృష్ణుణ్ణి శరణాగతి పొందండని ప్రజలకు మనం బోధించిన వెంటనేవారి భ్రాంతి అనే పొగమంచు తొలగిపోతుంది. కృష్ణ చైతన్య విధానం చాలా సులభం. 'హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే / హరే రామ హరే రామ రామ రామ హరే హరే' అనే మహామంత్రాన్ని కీర్తిస్తే చాలు.

ఈ నామాన్ని ఉచ్చరించిన కొలదీ అనేక జన్మల అంధకారం తొలగిపోతుంది. 'చేతోదర్పణమార్జనమ్' - ఈ మహామంత్ర కీర్తనం వలన మనస్సనే అద్దంమీద పేరుకున్న దుమ్ము తొలగిపోతుంది. మనస్సు ఆధ్యాత్మిక విషయాలను స్పష్టంగా గ్రహించ గలుగుతుంది. ఆ విధంగా మానవుడు తాను ఎవరో, భగవంతుడు ఎవరో, ప్రపంచం అంటే ఏమిటో, భగవంతుని తోనూ ప్రపంచంతోనూ తనకు కల సంబంధం ఏమిటో, ఈ లోకంలో ఎలా జీవించాలో, తన మరుసటి జన్మ ఎలా ఉండగలదో మొదలైన విషయాలను తెలుసుకో గలుగుతాడు. ఈ విధమైన జ్ఞానం పాఠశాలలలో బోధించరు. ఇంద్రియ తృప్తికోసం కావలసిన వస్తువులను ఎలా తయారు చేసుకోవాలో వాటిని ఎట్లు సంపాదించాలో మాత్రం బోధిస్తారు. భౌతిక ప్రకృతి మీద ఆధిపత్యాన్ని సాధించే ప్రయత్నంలో నిరంతరం తీవ్రమైన ఘర్షణ కొనసాగుతూ ఉంది. అయితే మనిషి ఏర్పరచుకుంటున్న ప్రతి సౌకర్యం వెంటా ఒక అసౌకర్యం ఉండనే ఉంది. ఉదాహరణకు : ఈ మధ్య కొందరు ఇంజనీర్లు అత్యంత వేగంగా ఏ ప్రమాదం లేకుండా ప్రయాణం చేయగల విమానాన్ని కనిపెట్టారు, కాని ఈ విమానం ఎగురు

తున్నప్పుడు నగరాలలోని ఇండ్ల కిటికీలు బ్రద్దలవుతున్నాయి. ఈ విధంగా మన అమూల్య సమయం తాత్కాలిక కృత్రిమ సౌకర్యాలను కలిగించే వస్తువులను తయారు చేయడంలోనే వృథా అయిపోతుంది. ఆ సౌకర్యాలకు సరిపడే అసౌకర్యాలు కూడా ఏర్పడుతున్నాయి. ఇదంతా ప్రకృతి నియమాల లోని ఒక భాగమే. క్రియ మరియు ప్రతిక్రియ సిద్ధాంతంలోని భాగం. మనం ఏది చేసినా దానికి కర్మఫలమనేది ఉంటుంది. దానిని మనం అనుభవించవలసి ఉంటుంది. ఈ విషయం భగవద్గీత (3.9)లో ఇలా చెప్పబడింది :

*యజ్ఞార్థాత్ కర్మణోஉన్యత్ర లోకోஉయం కర్మబన్ధనః*
*తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసంగః సమాచర*

"యజ్ఞరూపుడైన విష్ణువు కొరకై కర్మనొనరింప వలెను. లేనిచో ఆ కర్మ భౌతిక బంధకారణమగును. కావున ఓ కుంతీపుత్రా! విష్ణువు తృప్తికొరకు విధ్యుక్త ధర్మముల నొనరించినచో నీవెప్పుడును బంధ విముక్తుడవై ఉందువు."

ఇంద్రియ తృప్తికోసం చేసే కర్మ అది మంచిదైనా చెడ్డదైనా ప్రపంచంతో బంధాన్ని కలిగిస్తుంది. కాని, శ్రీకృష్ణుని కోసం చేసే కర్మ (*యజ్ఞార్థాత్ కర్మణో*) వాంఛనీయతతో, అవాంఛనీయతతో సంబంధం లేకుండానే ఎలాంటి బంధాన్నీ కలిగించదు.

శుకదేవ గోస్వామి శుద్ధమైన భక్తియుక్త సేవ ఉచితమని చెప్పడమే కాకుండా ఆ భక్తియుక్త సేవ ద్వారా పాపఫలితాలు ప్రక్షాళితం అవుతాయని కూడా తెలిపాడు. ఇంచుమించు మనలో ప్రతివాడూ పాపకార్యాలను చేసినవాడే. మనం పాపకార్యాలను చేయబట్టే ఈ భౌతిక దేహాలలో బంధించబడ్డాము. ఈ పాపపూరితమైన దేహాల నుంచి విముక్తులము

కాగానే మనం విముక్తిని పొంది, ఆధ్యాత్మిక దేహాలను పొంది ఆధ్యాత్మిక లోకాలకు చేరుతాము. అందుకే ఈ పాపపూరితమైన భౌతిక జీవితంలోని దోషములనే బురదను కడిగి వేసుకోవడానికి ఈ విధానం అంతా తెలుపబడింది.

"మహారాజా! పాపాత్ములు 'తప ఆదిభిః' – తపస్సు మొదలైన వాటివల్ల పాపభారాన్ని తొలగించుకుని పవిత్రులు కావొచ్చును" అని శుకదేవ గోస్వామి పరీక్షిన్మహారాజుతో అన్నాడు. అయితే కఠోరమైన తపోనియమాల వల్ల ఎవరూ సంపూర్ణంగా పాపవిముక్తులు కాలేరని కూడా ఆయన తెలిపాడు. చాలామంది యోగులు కఠిన తపస్సును ఆచరించినను సంపూర్ణంగా పాపవిముక్తులు కాలేకపోయారు. ఉదాహరణకు విశ్వామిత్రుడు. అతడు క్షత్రియుడు, బ్రాహ్మణుడు కాదలచి తపస్సు చేయడం ప్రారంభించాడు. కాని తరువాత పరిస్థితులకు బానిసై మేనక అనే దేవలోక వేశ్యవ్యామోహంలో పడిపోయాడు. విశ్వామిత్రుడు పవిత్రుడు కాలేకపోవడం వల్లనే మేనక వలలోపడి శిశువును కన్నాడు. అందుచేత మనిషి ఎంతటి కఠిన వ్రతానుష్ఠానాలు, తపోవిధిని ఆచరించినా భౌతిక పరిస్థితులు అతనిని ఏదోవిధంగా తిరిగి త్రిగుణాలలో చిక్కుకునేటట్లు చేస్తాయని శాస్త్రగ్రంథాలు ప్రకటిస్తున్నాయి. ఈ ప్రపంచం మిథ్య అని చెబుతూ, "మేము బ్రహ్మాభిముఖులము అవుతాము" అంటూ, ప్రపంచాన్ని సన్న్యసించి, తిరిగి ప్రాపంచిక విషయాలైన వైద్యశాలల స్థాపనవంటి మానవసంక్షేమ కార్యాలు, ధర్మకార్యాలు చేస్తున్న చాలామందిని మనం చూడవచ్చును. ప్రపంచం మిథ్య అయినప్పుడు వారికి ఇంకా మానవ సంక్షేమ కార్యక్రమాల పట్ల ఆసక్తి ఎందుకు? ఈ ప్రపంచం మిథ్య కాదనీ, తాత్కాలికమనీ కృష్ణ చైతన్యతత్త్వం బోధిస్తుంది. భగవంతుడు ఈ ప్రపంచాన్ని సృష్టించాడు. భగవంతుడు సత్యమైనప్పుడు అతడు సృష్టించిన

ఈ జగత్తు మిథ్య ఎలా అవుతుంది? భగవంతుడు పరమసత్యం కనుక అతడు సృష్టించిన ఈ జగత్తు కూడా సత్యమే. మాయప్రభావం వల్ల మనం దానిని మరోలా భావిస్తున్నాము. ఈ జగత్తు ఒక సత్యం, కాని అది తాత్కాలిక సత్యం. ఇది కూడా అశాశ్వతమైనదే.

మానవుడు ఈ జగత్తులో గల వస్తువులలో కొన్నింటిని తన ఆస్తి అని చెప్పుకుంటున్నాడు. కాని ఇది పొరపాటు. ఇది ఎవరిదో ఒకరి ఆస్తి కావటం సత్యం. ఇది భగవంతుని ఆస్తి (ఈశావాస్య మిదం సర్వమ్). హక్కుదారుడు భగవంతుడు. అంతమాత్రం చేత ఆస్తి అబద్ధం కాదు. నాది అని మనుషులు చెప్పుకోవడం అబద్ధం, నేను హక్కుదారుణ్ణి, యజమానినీ, భగవంతుణ్ణి అనే అసత్య దాంభికభావం వల్లనే అలా అంటున్నారు. ఈ లోకంలో ప్రతివాడూ దేనికైనా యజమానుడు కావాలనీ, మంత్రి కావాలనీ, రాష్ట్రపతి కావాలనీ, తరువాత భగవంతుణ్ణి కావాలనీ కోరుకుంటాడు. తాను కోరుకున్నది ఏదీ జరుగనప్పుడు తను భగవంతుడు కావాలనీ కోరుకుంటాడు. అందరికంటె తాను అత్యున్నతుడు కావాలని కోరుకునే ప్రవృత్తి మనిషిలో కలదు. కాని వాస్తవం ఏమిటంటే భగవంతుడు తప్ప వేరే సర్వోత్తముడు లేడు. భగవంతునితో పోల్చినప్పుడు జీవి(జీవాత్మ) అత్యల్పుడు. ఈ అత్యల్పుడూ అసత్యం కాదు, ఆ సర్వోన్నతుడూ అసత్యం కాదు. కాని ఈ అత్యల్పజీవి తాను గొప్పవాడినని భావించడం మాత్రం అసత్యం.

పరబ్రహ్మ 'అణోరణీయాంశమ్' - పరమాణువు కన్న చాలా సూక్ష్ముడనీ, 'మహతో మహీయాంశమ్' - అత్యంత అధికమైన దానికన్న అధికాధికుడనీ వైదిక సారస్వతం వల్ల తెలుస్తుంది. మనకు అర్థమైనంత వరకూ ఈ విశ్వం ఉన్న అంతరిక్షమే చాలా గొప్పది. కాని శ్రీకృష్ణుడు ఇలాంటి విశ్వాలను లక్షోపలక్షలు తన నోటిలో చూపించాడు. భగవదంశ

మాత్రులైన మనుషులు భగవంతుని గొప్పదనాన్ని గ్రహించలేరు. జీవులమైన మనం అల్పులము, భగవంతుని అంశభూతులము. భగవంతుడు అనంతుడు. మనలో కల జీవాత్మ సూక్ష్మదర్శినిలో కూడా కనిపించనంత అతి సూక్ష్మమైనదన్న మాట నిజం. భౌతిక జ్ఞానేంద్రియాలతో దానిని ఊహించనైన ఊహించలేము. కనుకనే అది అణువుకన్ననూ సూక్ష్మమని చెప్పబడింది (*అణోరణీయాంశమ్*).

జీవులు దేవాదిదేవుడైనా శ్రీకృష్ణుని ఆత్మలే. కాబట్టి మనకు శ్రీకృష్ణునితో గుణైక్యము కలదు. కాని పరిమాణాన్ని బట్టి భగవంతుడు గొప్పవాడు. జీవులు అల్పులు. వేదశాస్త్రాల ఆధారంగా ఈ సత్యాన్ని మనం వెంటనే అంగీకరించాలి. "*యస్యైకనిశ్వసితకాలమథావలంబ్య జీవంతి లోమవిలజా జగదండనాథాః*" - భగవంతుడు శ్వాసబయటికి వదిలినప్పుడు అనేక లక్షల విశ్వాలు అతని దేహం నుంచి వెలువడుతూ ఉన్నాయి. అతడు శ్వాస తీసుకున్నప్పుడు అవి అదృశ్య మవుతున్నాయి - అని 'బ్రహ్మ సంహిత' (5.48) లో తెలుపబడింది. కేవలం భగవంతుని ఉచ్ఛ్వాస నిశ్వాసాల వల్లనే లక్షలకొలదీ విశ్వాలు పుడుతున్నాయి, నశిస్తూన్నాయి. అటువంటప్పుడు జీవులు ఏ వస్తువునైనా నాది అని ఎలా చెప్పుకోగలరు ? మనిషి తాను యజమానుడనని కాని భగవంతుడనని కాని చెప్పుకోకుండా ఉండడం మంచిది. ఈ రోజులలో మనిషి తానే భగవంతుణ్ణి అని చెప్పుకోవడం ఒక నాగరికతా పద్ధతి అయింది. కొందరు మూఢులు వారి మాటలను నమ్ముతున్నారు కూడా. కాని వైదిక సాహిత్యాన్ని బట్టి భగవంతుడు అంత సులభంగా లభించువాడు కాదని తెలుస్తుంది.

మనం అహంకార పూరితాలైన దాంభిక ప్రకటనలను చేయకుండా ఉన్నంత వరకూ మనం ముక్తులమే; మనం ముక్తిని కోరవలసిన అవసరమే లేదు. కాని : "ఈ దేహమే నేను" అని భావిస్తున్నంతకాలం మనకు ముక్తి

ఉండదు. తాను దేహం గల భిన్నుడనని మనిషి స్పష్టంగా తెలుసుకోవడమే ముక్తి. కనుకనే శుకదేవ గోస్వామి : "ప్రాయశ్చిత్తం విమర్శనమ్"– "జ్ఞానాన్ని అభివృద్ధిపరచుకో, అది నీకు మనశ్శాంతి నిస్తుంది" అని అన్నాడు. మనం ఆత్మ విస్ఫులింగాలలోని అత్యల్ప కణాలమనీ, పరమాత్మ అయిన దేవాదిదేవుడు మనకు కావలసిన వాటినన్నింటినీ సమకూరుస్తాడనీ(ఏకో *బహూనాం యో విదధాతి కామాన్*) తెలుసుకున్నప్పుడే మన జ్ఞానం పరిపూర్ణం అవుతుంది. మనం అత్యల్పులమనీ, భగవంతుని అంశభూతుల మనీ తెలుసుకోవడం వల్ల భగవంతుణ్ణి సేవించడమే మన కర్తవ్యం అని గ్రహించ గలుగుతున్నాము. ఈ సృష్టికంతటికీ ఈ విశ్వరూపానికీ భగవంతుడే కేంద్రం, అతడే భోక్త; మనం ఆయనకు సేవకులము – అనే సిద్ధాంతం మనకు స్పష్టంగా తెలిసినప్పుడు మనం ముక్తుల మవుతాము.

అన్ని మిథ్యాసిద్ధాంతాల నుంచీ బయట పడటమే ముక్తి. ముక్తుల మయ్యాక మనకు పదిచేతులు పుట్టుకు వస్తాయని అర్థం కాదు. శ్రీమద్భాగవతం (2.10.6)లో ముక్తిని "ముక్తిర్హిత్వాన్యథా రూపమ్" అని నిర్వచించారు. 'ముక్తి' అంటే త్యజించటం. 'అన్యథా రూపమ్' అంటే జీవితానికి సంబంధించిన మిథ్యాభావన. అంటే మాయా యుక్తభావాలను వదలి తన నిజస్థితిలో కల మనిషి ముక్తుడని భావం. జ్ఞానం సిద్ధించిన వెంటనే మనిషి ముక్తుడవుతాడని కూడా శ్రీమద్భాగవతంలో తెలుపబడింది. ఈ జ్ఞానం సులభమైనది కనుక అత్యంత సులభంగా పొందవచ్చును. భగవంతుడు గొప్పవాడు, నేను ఎంతో అల్పుడను. నా జీవిత అవసరాలన్నింటినీ సమకూర్చే సర్వోన్నతుడు భగవంతుడే. నేను అతని సేవకుడను – అని గ్రహించడమే ఆ సరళమైన జ్ఞానం. దీనిని ఎవరు కాదనగలరు? ఇది సత్యం. మేము ఇంతటి వాళ్ళము, అంతటి వాళ్ళము అనే అపోహ ఆఖరికి మనమే భగవంతులము అనే భ్రాంతికి దారి

తీస్తుంది. కాని మనం ఎటువంటి భగవంతులమో మనం గుర్తించడం లేదు. దేహంలో ఏ కొద్దిపాటి అస్వస్థత కలిగినా మనం వైద్యుని వద్దకు పరుగెత్తుతున్నాము. అంతటి అల్పులము మనము. తానే సర్వశక్తి మంతుడైన భగవంతుణ్ణి అని చెప్పుకునేవాడు చివరగా మాయామోహితుడైన వాడని మనం గ్రహించాలి. అలా 'మాయ'లో పడినవాడు లేనిపోని అపోహలలో బద్ధుడై ఉంటాడు కనుక ముక్తుడు కాలేదు.

సమ్యగ్(సరియైన) జ్ఞానాన్ని పొందినవాడే ముక్తుడు కాగలడు. 'ముక్త' దశ 'బ్రహ్మభూత' దశ అని పిలువబడుతూంది. ఈ దశను అందుకున్న వారిని భగవద్గీత (18.54) లో శ్రీకృష్ణుడు ఇలా వర్ణించాడు :

*బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి*
*సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్*

"ఈ విధంగా దివ్యస్థితి యందు ప్రతిష్ఠితుడైనవాడు శీఘ్రమే పరబ్రహ్మాను భవమును పొంది ఆనందపూర్ణుడగును. దేనికొరకు శోకింపక, దేనిని వాంఛింపక అట్టివాడు సర్వజీవుల యెడ సమత్వభావమును కలిగి యుండును. అటువంటి స్థితి యందే అతడు నా శుద్ధభక్తియుక్త సేవను పొందుచున్నాడు."

మనిషి : "నేను ఇంతకాలం లేనిపోని అపోహలతో మాయలో పడ్డాను. నేనెంత మూర్ఖుణ్ణి! నేనే భగవంతుణ్ణి అని భావించేవాణ్ణి. కాని ఇప్పుడు నేను భగవంతుని శాశ్వత సేవకుణ్ణి అని గ్రహిస్తున్నాను" – పొందవలసిన జ్ఞానాన్ని పొందినప్పుడు శాంతినీ ఆనందాన్నీ పొందు తున్నాడు. ఇలాంటి జ్ఞానాన్ని పొందిన తరువాత అతడు 'ప్రసన్నాత్ముడు' అవుతున్నాడు. ఇదే జీవాత్మ నిజస్థితి.

కృష్ణ చైతన్యం కలిగిన తరువాత మనిషికి ఇక శోకమనేదే ఉండదు.

ఎందుకంటే తాను భగవంతుని అంశభాగమనీ, ఆత్మ విస్ఫులింగమనీ దేవాదిదేవుడు తనను సదా రక్షిస్తూ ఉంటాడనీ అతనికి తెలుస్తుంది. అలాంటి స్థితిలో శోకానికి అవకాశం ఏది? పసిబాలుడు తన తండ్రి తన దగ్గరే ఉన్నాడని తెలిసినంత వరకూ తాను నిర్భయుడుగా స్వతంత్రుడుగా ఉన్నట్లుగా భావిస్తాడు. "నా తండ్రి నా ప్రక్కనే ఉన్నాడు. కాబట్టి నాకే భయము లేదు. నన్నెవరూ ఏమీ చేయలేరు" అని నిశ్చింతగా ఉంటాడు. అదే విధంగా శ్రీకృష్ణుణ్ణి శరణుపొందినవాడు కూడ శ్రీకృష్ణుడు తనను రక్షిస్తున్నాడు కనుక తనకు ఏ విధమైన అపాయము లేదని సంపూర్ణ విశ్వాసంతో ఉంటాడు. ఆ విధంగా శ్రీకృష్ణుణ్ణి శరణు పొందినవానికి శోకం కాని, కోరిక కాని ఉండవు. భగవంతుని పట్ల భక్తివిశ్వాసము లేనివారు చింతలతో దుఃఖాలతో ఉంటారు. అటువంటివారు తమకు లేని దాని కోసం ఆరాటపడుతూ తాము సంపాదించి పోగొట్టుకున్న వాటికై దుఃఖిస్తూ ఉంటారు. భగవద్భక్తులకు అలాంటి బాధ ఉండదు. తనకు ఉన్నది పోయినప్పుడు అది భగవంతుని సంకల్పం అని అతడు గ్రహిస్తాడు కాబట్టి: "ఇది భగవంతుని అభీష్టం కనుక మంచిదే" అని ఊరుకుంటాడు. తన అవసరాలన్నింటినీ పరమపిత అయిన శ్రీకృష్ణభగవానుడే సమకూరుస్తాడని అతనికి తెలుసు కనుక అతడు దేనినీ కోరడు.

తనకూ భగవంతునికీ మధ్య గల సంబంధాన్ని గ్రహించిన వెంటనే మనుషులు జంతువులు – ప్రాణికోటి అంతా సంపూర్ణ పురుషుని అంశలే కనుక అందరూ సమానమని గ్రహిస్తాడు. కనుక అతడు విశ్వమానవ సౌభ్రాత్ర దృష్టిని పొందుతాడు. ఈ విధంగా విశ్వమానవ సౌభ్రాత్ర దృక్పథాన్ని పొందినవాడు ఎవరి పట్లనూ ఈర్ష్య చెందడు. మరొక ప్రాణిని తన స్వార్థానికై ఉపయోగించుకోడు, బాధించడు. కృష్ణభక్తుడు ఈ విధంగా సరియైన చైతన్యంతో ఉంటాడు కనుక అతడు సహజంగానే సకల

సద్గుణాలను అలవరచు కుంటాడు. "యస్యాస్తి భక్తిర్భగవత్యకించనా సర్వైర్గుణైస్తత్ర సమాసతే సురాః" (భాగ. 5.18.12) - కృష్ణ చైతన్యాన్ని పెంపొందించు కునేవాడు దేవతలకుండే అన్ని ఉత్తమ గుణాలను అలవరుచు కోగలుగుతాడు. 'వాంఛా కల్పతరుభ్యశ్చ కృపాసింధుభ్య ఏవ చ' : వైష్ణవుడు లేక కృష్ణభక్తుడు ఇతరుల పట్ల దయాసముద్రుడై ఉంటాడు. సమాజానికి భగవత్ చైతన్యం అత్యవసరం కనుక కృష్ణభక్తుడు సమాజానికి కృష్ణ చైతన్యమనే మహావరాన్ని ప్రసాదిస్తూన్నాడు. వైష్ణవుడు : "హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే / హరే రామ హరే రామ రామ రామ హరే హరే" అనే అమూల్యమైన మహామంత్రమనే వరాన్ని ప్రసాదిస్తున్నాడు. ఈ మహా మంత్రాన్ని స్మరించినంత మాత్రాననే మనిషి ముక్తావస్థలో నెలకొంటాడు.

ముక్తావస్థ(విముక్త దశ) అనగానే అది ఏదో సమాధి దశ అని ఎవరు అనుకోరాదు. పద్మాసనం వేసుకుని రోజుల తరబడి ఒక మూల కూర్చోవడం అని కాని భావించకూడదు. అలా భావించడం సరికాదు. ముక్తి అంటే సేవ. "నేను శ్రీకృష్ణునికి నా జీవితాన్ని అంకితం చేశాను, కనుక నన్ను సమాధిస్థితిలో ఉండనివ్వండి" అని ఎవరు చెప్పడానికీ వీలు లేదు. శరణాగతి ప్రమాణాన్ని 'నిషేవయా' - సేవతో నిలుపుకోవాలి. దేవాదిదేవునికి సేవచేసిన కొలది అతని భక్తుని హృదయంలో భగవానుడు సాక్షాత్కరిస్తాడు. ఈ భక్తియుక్త సేవాకార్యక్రమం ఉదయం నుంచి రాత్రివరకూ నిర్వర్తించ బడుతూనే ఉంటుంది. రోజుకు ఇరవై నాలుగు గంటలు భక్తుడు తన భక్తియుక్త సేవలో నిమగ్నుడై ఉండాలని శ్రీకృష్ణుడు భగవద్గీతలో ఆదేశించాడు. రోజుకు పదిహేను నిమిషాలు భగవంతుణ్ణి ధ్యానించి తక్కినకాలం అంతా అన్నివిధాలైన చేయకూడని పనులను చేయకూడదు. మనం శ్రీకృష్ణుణ్ణి సేవించిన కొలది శ్రీకృష్ణుడికి మరింతగా శరణాగతుల మవుతాము. కాబట్టి మనకు గల నైపుణ్యాన్ని అంతా శ్రీకృష్ణుని

సేవకే ఉపయోగించాలి. భక్తియుక్త సేవ తొమ్మిది విధాలు : శ్రవణం, కీర్తనం, స్మరణం, దాస్యం, దేవాలయంలో భగవంతుని శ్రీ విగ్రహములను పూజించడం, ప్రార్థించడం, భగవంతుని ఆజ్ఞను పాటించడం, భగవంతుణ్ణి స్నేహితునిలా సేవించడం, సమస్తాన్నీ భగవంతునికి అర్పించడం. ప్రతివ్యక్తి ఈ నవ విధ భక్తియుక్త సేవలో కనీసం ఏదో ఒక దానినైనా ఆచరించాలి. కృష్ణసేవా నిరతుడైనవానికీ ఎప్పటికి విసుగు అనేదే కలుగదు(భజతాం ప్రీతిపూర్వకమ్). ఈ భక్తియుక్త సేవ ప్రీతిపూర్వకంగా జరుగాలి. ప్రారంభంలో ఇది కొంచెం కష్టంగా తోస్తుంది. విసుగు కలుగవచ్చును. కాని కృష్ణసేవలో పురోగమించిన కొలది ఈ భక్తియుక్త సేవ ఆనంద దాయకంగా ఉంటుంది. ఈ విషయాన్ని శ్రీకృష్ణుడు భగవద్గీత (18.37) లో ఇలా సూచించాడు :

*యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్*
*తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్*

"ఆది యందు విషప్రాయముగా నుండి అంత్యమున అమృతముతో సమానమగునదియు మరియు ఆత్మానుభూతి యెడ మనుజుని జాగృతిని చేయునదియు నైన సుఖము సత్త్వగుణ ప్రధానమైనదని చెప్పబడును."

ఆధ్యాత్మిక స్థితిని పొందిన తరువాత మనకు నిజంగా విసుగు కలిగించేది భౌతిక సేవే. ఉదాహరణకు మనం ఆజన్మాంతం 'హరే కృష్ణ' మహామంత్రాన్ని జపించినా అలసిపోము; కాని ఏదైనా భౌతికమైన నామాన్ని పదే పదే జపిస్తూ ఉంటే త్వరలోనే అలసిపోతాము. కృష్ణనామాన్ని కీర్తించిన కొలదీ శ్రీకృష్ణుడు మనకు సన్నిహితుడవుతాడు. శ్రీకృష్ణుని నామాన్ని వినడం, కీర్తించడం మొదటి దశ. స్మరణం తరువాతి దశ - శ్రీకృష్ణుణ్ణి నిరంతరం స్మరించడం. కీర్తించడంలోనూ శ్రవణంలోనూ పరిపూర్ణుడైన

భక్తుడు నిరంతరం శ్రీకృష్ణుణ్ణి స్మరిస్తాడు. ఈ మూడవ దశలో అతడు మహాయోగి అవుతాడు.

కృష్ణ చైతన్యంలో సాధించిన ప్రగతి ఎన్నటికీ వృథా కాదు. భౌతిక ప్రపంచంలో ఒక మనిషి ఒక కర్మాగారాన్ని నిర్మించడం ప్రారంభించి దానిని పూర్తి చేయకుండా వదలి పెడితే ఆ కర్మాగారం అన్ని విధాలా నిరుపయోగం అవుతుంది. నిర్మాణాన్ని సగం అయిన తరువాత ఆపివేస్తే దానికోసం పెట్టిన పెట్టుబడి అంతా వ్యర్థం అయినట్లే. కృష్ణ చైతన్యం అలాంటిది కాదు. కృష్ణ చైతన్య సాధన ప్రారంభించిన వాడు పరిపూర్ణ దశకు రాకపోయినా అంతవరకూ సాధించినదంతా శాశ్వత నిధిలా ఉండిపోతుంది; వెనుకటి జన్మలో వదలిపెట్టిన ఘట్టం నుంచి కొనసాగించ వచ్చును. కృష్ణ చైతన్యాన్ని – భక్తిని ప్రారంభించినవాడు కోల్పోయేది ఏమీ లేదని శ్రీకృష్ణుడు భగవద్గీత (2.40) లో ధ్రువపరుస్తున్నాడు:

*నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే*
*స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్*

"ఈ ప్రయత్నము నందు నష్టముగాని, హాని గాని లేదు. ఈ మార్గమున స్వల్పపురోగతియు మహత్తరమైన భయము నుండి మానవుని రక్షించును."

భగవద్గీతలోని ఆరవ అధ్యాయంలో విఫలుడైన యోగి గతి ఏమిటని అర్జునుడు ప్రశ్నించినప్పుడు శ్రీకృష్ణుడు ఇలా సమాధానం చెబుతున్నాడు :

*పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే*
*న హి కల్యాణకృత్కశ్చిద్ దుర్గతిం తాత గచ్ఛతి*

"ఓ పార్థా! శుభకార్యముల యందు నియుక్తుడైనవాడు ఈ లోకమున

గాని, ఆధ్యాత్మిక లోకమున గాని వినాశమును పొందదు. మిత్రమా! మంచి చేయువాడెన్నడును చెడుచే పరాజితుడు కాడు." (భ.గీ.6.40)

విఫలుడైన యోగి కృష్ణ చైతన్య యోగాభ్యాసాన్ని మరుసటి జన్మలో తాను వదలిపెట్టినప్పటి నుంచీ ప్రారంభిస్తాడని శ్రీకృష్ణుడు ప్రకటించాడు. అంటే ఒక జన్మలో యాభైశాతం పూర్తి చేసినవాడు మరుసటి జన్మలో యాభై ఒకటవ శాతం నుంచి ప్రారంభిస్తాడన్న మాట. అయితే మనం మన జీవితకాలంలో కూడబెట్టిన భౌతిక సంపదలనూ స్థిరచరాస్తులనూ మరణానంతరం వెంట తీసుకొని పోలేము కనుక ఇక్కడే విడిచి పెడుతున్నాము.

ఏది ఏమైనా మరుసటి జన్మలో కృష్ణ చైతన్యాన్ని పొందువచ్చునులే, అప్పటివరకూ వేచి ఉండాలని భావించకూడదు; ఈ జన్మలోనే కృష్ణ చైతన్య సాధనా లక్ష్యం పూర్తి చేసుకోవడానికే ప్రయత్నించాలి. తన భక్తుడు తప్పక తనను చేరుతాడని శ్రీకృష్ణుడు మనకు వాగ్దానం చేస్తున్నాడు :

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే

"సర్వదా నన్ను గూర్చియే ఆలోచింపుము. నా భక్తుడవగుము. నన్ను అర్చింపుము మరియు నాకు నమస్కరింపుము. ఈ విధముగా నీవు తప్పక నన్ను చేరగలవు. నీవు నా ప్రియమిత్రుడ వగుటచే నీకిది నేను వాగ్దానము చేయుచున్నాను." (భ.గీ.18.65)

శ్రీకృష్ణుని మనం చేరుతున్నామంటే మనం ఇక శూన్యం ముందు కాని, నామ రూపరహితమైన బ్రహ్మజ్యోతి ముందు కాని నిలబడుతామని భావించరాదు. మనలాగే భగవంతుడు కూడా వ్యక్తి. మన తండ్రి రూప సహితుడనీ అతని తండ్రి కూడా అంతేననీ మనం భౌతికంగా

గ్రహిస్తున్నాము. అలాగే అతని తండ్రి తండ్రి కూడా ఒక వ్యక్తే. అలాగే మరింత వెనుకకు వెళ్తే పరమపిత అయిన శ్రీకృష్ణుడు కూడా దేహం ధరించిన వ్యక్తే అయి ఉండాలి. ఈ విషయం తెలుసుకోవడం గొప్ప కష్టమేమీ కాదు. భగవంతుడిని పరమపిత అంటూ వేదాలే కాదు బైబిలు, ఖురాను తదితర మత గ్రంథాలన్నీ తెలుపుతూ ఉండడం మనకు తెలిసిన విషయమే. పరమసత్యమే పరమపిత అనీ, అతని నుంచే ప్రతీది జనించిందనీ వేదాంత సూత్రాలు ధ్రువీకరిస్తున్నాయి. వేదాలు (కఠోపనిషత్తు, 2.2.13) కూడ దీనిని బలపరుస్తున్నాయి :

*నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానామ్*
*ఏకో బహూనాం యో విదధాతి కామాన్*

"దేవాదిదేవుడు శాశ్వతులందరిలోను పరమ శాశ్వతుడు; జీవులందరిలోనూ ఉత్తమ పురుషోత్తముడు. అతడే అందరిని పోషించువాడు. జీవులలో కనిపించే వాంఛలు, జీవిత లక్షణాలన్నీ కేవలం పరమపిత వాంఛలకూ జీవిత లక్షణాలకూ ప్రతిబింబాలే." అంటే అతనికి వాంఛలున్నాయి కనుకనే మనకు వాంఛలు కలుగుతున్నాయి. మనం భగవంతుని అంశభూతులము కనుక అతని గుణాలన్నీ సూక్ష్మరూపంలో మన యందు కూడా ఉన్నాయి. భౌతిక ప్రపంచంలో మనం చూసే కామక్రీడలు కామజీవితం ఆధ్యాత్మిక ప్రపంచంలో ఉండే ప్రేమకు వికృతరూపమే. భగవంతుడిని విస్మరించ బడడం వల్లనే ఈ ప్రపంచం భౌతికం అయింది; భగవంతుడిని స్మరించిన వెంటనే ఈ ప్రపంచం ఆధ్యాత్మికం అవుతూంది. అంటే శ్రీకృష్ణుడు విస్మరించబడని స్థలం ఆధ్యాత్మిక ప్రపంచం అని. వైదిక సాహిత్యంలో ఆధ్యాత్మిక ప్రపంచానికీ అర్థం ఈ విధంగా చెప్పబడింది. కాబట్టి మనం ఒక్కక్షణం కూడా శ్రీకృష్ణుణ్ణి విస్మరించని విధంగా మన జీవితాలను

తీర్చిదిద్దుకోవాలి. ఈ విధంగా శ్రీకృష్ణుని సేవలోనే మనం నిరంతరం నిమగ్నులమైతే శ్రీకృష్ణుని ధామమైన వైకుంఠంలో లేక వృందావనంలో నిరంతరం నివసిస్తాము.

ప్రస్తుతం మనం కలుషితమైన చైతన్యంతో ఉన్నాము కనుకనే ఈ ప్రపంచాన్ని భౌతికంగాను నరకప్రాయంగాను మారుస్తున్నాము. కలలలో మనం ఏవేవో సమస్యలను కల్పించుకున్నట్లే మన నిజస్థితి మనకు తెలియక పోవడం వల్ల ఈ లోకంలో కూడా అనేక సమస్యలను సృష్టించు కుంటున్నాము. నిజానికి అవి సమస్యలు కావు. మనం పెద్ద తుఫానులో చిక్కుకున్నట్లు కాని, ఎవరో మనలను వెంటాడుతున్నట్లు కాని, మన ధనాన్ని ఎవరో అపహరించినట్లు కాని, పెద్దపులి మనలను మ్రింగి వేస్తున్నట్లు కాని మనకు కలలు వస్తుంటాయి. కాని నిజానికి అవన్నీ మనస్సు కల్పించేవే. మన మనోభావాలే : "అసంగో హ్యయం పురుష ఇతి శ్రుతేః" - పురుషునికి అంటే ఆత్మకు స్వప్నాలవంటి భౌతిక కర్మలతో ఎటువంటి సంబంధం లేదని వేదాలు ఘోషిస్తున్నాయి. ఈ స్వప్న స్థితి నుంచి మేల్కొనడానికే మనం కృష్ణ చైతన్యమార్గాన్ని తప్పక అనుసరించాలి (బృహద్ ఆరణ్యకోపనిషత్తు, 4. 3. 15).

ఫలాపేక్ష గల కర్ములు(కర్మమార్గానుయాయులు), ఊహాపోహలు చేసేవారు, యోగులు, భక్తులు లేదా కృష్ణభక్తులు - వీరందరి కంటె శ్రీకృష్ణుని భక్తులు ఉత్తములు. శుద్ధమైన ప్రేమవాంఛాకల భక్తుడు ప్రశాంతంగా ఉండగలడు; తక్కినవారు ఉండలేరు. శుద్ధభక్తునికి కోరికలు ఉండవు. అతడు కేవలం శ్రీకృష్ణుని సేవలోనే ఆనందంగా ఉంటాడు. శ్రీకృష్ణుడు భగవంతుడా కాడా అని ఏమాత్రం ఆలోచించడు. శ్రీకృష్ణుడు సర్వశక్తిమంతుడు, సర్వాంతర్యామి అనే విషయాలతో అతనికి సంబంధం లేదు. వృందావనంలోని గోపికలు, గోపబాలురు ఎలా శ్రీకృష్ణుణ్ణి

నిర్మలమైన మనస్సుతో ప్రేమించారో అలాగే ప్రేమిస్తాడు. వారికి శ్రీకృష్ణుడు భగవంతుడో కాడో ఏమీ తెలియదు. వారు వేదాంతులు కారు, యోగులు కారు, కర్మాచరణాపరులు కారు; కేవలం శ్రీకృష్ణుని దర్శన భాగ్యానికే మురిసిపోయిన అమాయక గ్రామీణ బాలబాలికలు. ఇది 'సర్వోపాధి వినిర్ముక్తం తత్పరత్వేన నిర్మలం' అనే మహోన్నత స్థితి. అంటే భౌతిక ఉపాధులన్నింటి నుంచీ విముక్తమైన పవిత్ర స్థితి.

యోగులు, జ్ఞానులు భగవంతుణ్ణి తెలుసు కోవడానికి ప్రయత్నిస్తున్నారు కాని, తమ మాయస్థితిని తెలుసుకోలేక పోతున్నారు. "మాయాసుఖాయ భరముద్వహతో విమూఢాన్" – వారు మాయా సుఖం కోసం పాటు పడుతున్నారు కనుక వారు మూఢులు. వారికి శాంతి కలుగుతుందనే ప్రశ్నేలేదు. జ్ఞానులు లేక ఊహాపోహాలు చేసేవారు ఈ భౌతిక ప్రపంచాన్ని నిరసిస్తూ(బ్రహ్మ సత్యం జగన్మిథ్య), ఈ భౌతిక లోకకష్టాల నుంచి విముక్తిని కోరుతున్నారు. ఈ భౌతిక జగత్తే సర్వస్వం అనుకొనే కర్ములకన్న వీరు(అంటే జ్ఞానులు) కొంత ఉన్నత స్థితిలో ఉన్నారు. "ఇక్కడ మనం సుఖంగా ఉంటాము" అనేది వారి అభిప్రాయం. ఈ భౌతిక ప్రపంచంలో శాంతియుత వాతావరణాన్ని కల్పించడానికి ప్రయత్నించడమే తమ ధర్మంగా(మతంగా) భావిస్తారు. కోట్లకొలది సంవత్సరాల నుంచీ అలాంటి ప్రయత్నాలు జరుగు తున్నప్పటికినీ, ఈ జగత్తులో శాంతి నెలకొనలేదనీ, నెలకొనదనీ ఆ మూర్ఖులకు తెలియదు. ఈ భౌతిక లోకం కష్టాలకూ, దుఃఖాలకు నిలయం అని సృష్టికర్త అయిన శ్రీకృష్ణుడే భగవద్గీత (8.16)లో ప్రవచించినప్పుడు ఇక ఈ లోకంలో శాంతి ఎలా సాధ్యపడుతుంది?

ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున
మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే

“భౌతిక జగత్తులోని అత్యున్నత లోకము మొదలుకొని అధమలోకము వరకు గల సర్వలోకములు జన్మమృత్యుభరితమైన దుఃఖప్రదేశములే. కాని ఓ కౌంతేయా! నా లోకమును చేరినవాడు తిరిగి జన్మము నొందడు.”

‘దుఃఖాలయమశాశ్వతమ్’ - ఈ జగతి దుఃఖమయమే కాదు, అశాశ్వతమైనది కూడా. ఆధ్యాత్మిక, ఆధిదైవిక, అధిభౌతికాలనే మూడు తాపాలను అనుభవిస్తూ ఎవరూ ఈ లోకంలో ఉండడానికి ఇష్టపడరు. అలా ఉండలేరు కూడా. ఈ జగత్తులో ఉన్నంతకాలం శిక్షలను అనుభవించడమే కాకుండా చివరికి గెంటివేయ బడుతున్నారు కూడా. ఒక వ్యక్తి బాగా ధనం గడించి బ్యాంకులో నిలువచేసి భార్యపుత్రులతో, విలాసవంతమైన భవనంలో నివసిస్తూ ప్రశాంతంగా జీవిస్తున్నాడని భావించవచ్చును. కాని ఏదో ఒక రోజున : “దయచేసి బయటకు వెళ్ళండి” అని అనిపించు కుంటాడు.

“ఎందుకు ? ఇది నా ఇల్లు. నేను కొనుక్కున్నాను. నాకు డబ్బు, ఉద్యోగం కలదు, బాధ్యతలు ఉన్నాయి. నేను ఎందుకు వెళ్ళిపోవాలి?” అని అడుగుతాడు.

“ఏం మాట్లాడ వద్దు, వెళ్ళిపోవాలి. వెళ్ళిపోండి” అని వినిపిస్తుంది.

అప్పుడు అతనికి భగవంతుడు కనిపిస్తాడు. “ఇన్నాళ్ళూ నేను భగవంతుణ్ణి విశ్వసించలేదు. ఇప్పుడు ఆ భగవంతుడే అన్నింటినీ తుద ముట్టిస్తున్నాడు” అని అతడు బాధపడతాడు. ఆ విధంగా రాక్షస ప్రవృత్తి కలవారు శ్రీకృష్ణుణ్ణి (భగవంతుణ్ణి) మృత్యువుగా గుర్తిస్తారు. ఎందుచేతనంటే ఆ సమయంలో శ్రీకృష్ణుడు వారి నుంచి సమస్తాన్నీ లాగివేస్తాడు కనుక.

మనం భగవంతుణ్ణి మృత్యువుగా ఎందుకు భావించాలి ? హిరణ్యకశిపుడు భగవంతుణ్ణి చూసినప్పుడు మూర్తీభవించిన మృత్యువులాగే చూచాడు ; కాని భక్తుడైన ప్రహ్లాదుడు భగవంతుణ్ణి చూచినప్పుడు తన

ప్రియతమ దేవాదిదేవుని రూపంలోనే చూచాడు. భగవంతుణ్ణి ఎదిరించే వారు అతనిని భయంకరాకారునిగా చూస్తారు. అతని పట్ల భక్తిప్రపత్తులు ఉన్నవారు అతనిని అతని నిజస్వరూపంలోనే దర్శిస్తారు. ఏమైనా ప్రతివారు భగవంతుణ్ణి దర్శిస్తారు.

చిత్తశుద్ధి గల భక్తుడు మాత్రం అంతటా శ్రీకృష్ణుణ్ణే దర్శిస్తాడు. "నన్ను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు. అంతటా నన్ను దర్శించడానికి ప్రయత్నించు" అని శ్రీకృష్ణుడే చెబుతున్నాడు. భగవంతుణ్ణి దర్శించడం మరింత సులభం చేయడానికి : "రసోఽహమప్సు కౌంతేయ" – "నేను నీటిలోని రుచిని" అని శ్రీకృష్ణుడు తెలిపాడు (భ.గీ.7.8). మనం దప్పిగొన్నప్పుడు ఒక పాత్రనిండా నీరు త్రాగి తృప్తిపడుతాము; దప్పికను తీర్చి తృప్తినిచ్చే శక్తి శ్రీకృష్ణునిదే అని గ్రహిస్తాము. ఆ విధంగానే సూర్యోదయం అయినప్పుడు కాని, చంద్రుడు ఉదయించినప్పుడు కాని మనం శ్రీకృష్ణుణ్ణి దర్శించగలము. "ప్రభాస్మి శశిసూర్యయోః" – సూర్య చంద్రులలోని కాంతిని నేనే అని శ్రీకృష్ణుడు తెలిపాడు. తరువాత దశలో మనం ప్రతి వస్తువులోనూ కల జీవశక్తి శ్రీకృష్ణుడేనని గ్రహించ గలుగుతాము. ఈ విషయాన్నే శ్రీకృష్ణుడు భగవద్గీత (7.9)లో ఇలా సూచించాడు :

పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు

"భూమి యొక్క ఆద్యమైన సుగంధమును, అగ్ని యందు ఉష్ణమును, జీవుల యందలి ప్రాణమును, తపస్వుల యందు తపస్సును నేనైయున్నాను."

ప్రతి పదార్థము తన మనుగడ కోసం శ్రీకృష్ణునిపైనే ఆధారపడి

ఉందని తెలుసు కొన్నప్పుడు అతనిని మనం విస్మరించే అవకాశమే ఉండదు. ప్రతి వస్తువు సృష్టి - స్థితి - లయాలు తన మీదనే ఆధారపడి ఉన్నాయని శ్రీకృష్ణుడు భగవద్గీత (7.6,7) లో సూచించాడు :

ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా

మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ

"సృష్టించబడిన సర్వజీవులకు ఈ రెండు ప్రకృతులే కారణములై యున్నవి. ఈ జగత్తు నందలి భౌతికమును, ఆధ్యాత్మికమును అగు సర్వమునకు మూలమును మరియు ప్రళయమును నేనేయని నిశ్చయముగా నెరుగుము.

ఓ ధనంజయా ! నా కన్నను శ్రేష్ఠమైన సత్యము మరొక్కటి లేదు. దారము నందు ముత్యములు కూర్చబడినట్లు సమస్తము నా పైననే ఆధారపడి యున్నది."

శ్రీకృష్ణుడు చాలా సులభంగా దర్శనం ఇస్తాడు. కాని అందరికీ కాదు. తన భక్తులకు మాత్రమే అలా సులభ దర్శనుడు. అసూయా పరులకూ, మూఢులకూ లేక అజ్ఞానులకు అతడు దర్శనమివ్వడు. మాయ అనే తెర వెనుక కనిపించకుండా ఉంటాడు :

నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్

"మూఢులకు మరియు అజ్ఞానులకు నేనెన్నడును వ్యక్తము కాను. వారికి నేను నా అంతరంగశక్తి చేత కప్పబడి ఉంటాను. అందుచేత వారు నేను అజుడననియు, నాశము లేనివాడనని ఎరుగరు." (భ.గీ. 7.25)

శ్రీకృష్ణుడు కనబడకుండా కప్పివేసే అతని 'యోగమాయ'– ప్రేమ వల్ల తొలగిపోతుంది. ఇది 'బ్రహ్మ సంహిత' (5.38) నిర్ణయం :

ప్రేమాంజనచ్ఛురితభక్తివిలోచనేన
సంత స్సదైవ హృదయేషు విలోకయంతి

"శ్రీకృష్ణునిపై ప్రేమను పెంచుకున్నవాడు అతనిని ఎల్లప్పుడు తన హృదయం లోనే దర్శించగలడు."

ఆ విధంగా శ్రీకృష్ణుణ్ణి దర్శించేవారు మరణానంతరం తాము ఎక్కడికి వెళ్తారో ఎరుగుదురు కనుక ఏమాత్రం కలత చెందరు. కృష్ణ చైతన్యమనే వరాన్ని పొందినవాడు తానిక తిరిగి ఈ భౌతిక జగత్తులో జన్మించనవసరం లేదనీ, శ్రీకృష్ణుణ్ణి చేరుకుంటాడనీ తెలుసుకొంటాడు. శ్రీకృష్ణుని వలెనే సచ్చిదానంద విగ్రహం పొందనిదే శ్రీకృష్ణుణ్ణి చేరడం సాధ్యం కాదు. తాను అగ్ని అయి ఉంటే తప్ప ఎవడు అగ్నిలో కలిసిపోలేడు. అలాగే ఆధ్యాత్మిక దేహాన్ని పొందితే తప్ప ఆధ్యాత్మిక జగత్తులో ప్రవేశించ లేడు. ఆధ్యాత్మిక దేహం కలవాడు అంటే గోపికలలాగ, గోపకుమారుల లాగ శ్రీకృష్ణునితో రాసక్రీడానృత్యం చేయగలుగుతాడు. ఈ నృత్యం సామాన్యమైన నృత్యం కాదు; దేవాదిదేవుడైన భగవంతునితో కలసి చేసే శాశ్వత నృత్యం. కృష్ణప్రేమతో పవిత్రులైనవారు మాత్రమే ఈ నృత్యంలో పాల్గొనగలరు. కాబట్టి ఈ కృష్ణ చైతన్యమార్గం చౌకబారుది కాదనీ, దేవాదిదేవుడు స్వయంగా, సంసార బాధతో దహించుకుపోయే మానవ జాతికి దయతో అనుగ్రహించిన అద్వితీయ వరప్రసాదమనీ గ్రహించాలి. కేవలం ఈ మార్గాన్ని అవలంబించి నందున మరణభయం వల్ల కలిగే భయాలు ఆందోళనలన్నీ పటాపంచలవుతాయి.

K. Nagabhushana Rao

# పరమపూజ్యశ్రీ శ్రీమత్ ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాదుల వారి పరిచయం

పరమపూజ్యశ్రీ శ్రీమత్ ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాదుల వారు భారతదేశములోని కలకత్తా నగరములో 1896 వ, సంవత్సరములో జన్మించారు. వారు తమ అధ్యాత్మిక ఆచార్యులైన శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతీ గోస్వామి వారిని కలకత్తాలో 1922 వ, సం.లో మొదటిసారి కలుసుకున్నారు. శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతుల వారు ప్రముఖ వైదిక విద్వాంసులు, 64 గౌడీయ మఠాలను (వైదిక సంస్థలను) స్థాపించారు. వారు విద్యాసంపన్నులు, యువకులయిన ప్రభుపాదుల వారిని చూచి ఎంతో సంతోషించి, వైదిక విజ్ఞానాన్ని బోధించడానికి తమ జీవితాన్ని అంకితము చేయుమని ఉపదేశించారు. ఆనాటి నుండి శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతీ ఠాకూరు వారికి శిష్యులై పదకొండు సంవత్సరాల తరువాత యథావిధిగా దీక్షను తీసుకున్నారు.

మొదటి సమావేశములోనే శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతీ ఠాకూరు గారు ఆంగ్ల భాష ద్వారా వైదిక విజ్ఞానాన్ని ప్రచారము చేయుమని శ్రీల ప్రభుపాదుల వారిని కోరారు. తరువాతి సంవత్సరాలలో శ్రీల ప్రభుపాదుల వారు భగవద్గీతకు భాష్యం వ్రాసి, గౌడీయమఠ కార్యక్రమాలకు తోడ్పడ్డారు. 1944 లో 'బ్యాక్ టు గాడ్‌హెడ్' (భగవద్దర్శనం) అనే ఆంగ్ల పక్ష పత్రికను స్థాపించారు. అది ఇప్పుడు పాశ్చాత్య దేశాలలో వారి శిష్యుల చేత ముప్పయి కంటె ఎక్కువ భాషలలో కొనసాగించ బడుతూంది.

శ్రీల ప్రభుపాదుల వారి భక్తివిజ్ఞానాలను గుర్తించి 1947 లో గౌడీయ వైష్ణవ సంఘం వారికి భక్తివేదాంత బిరుదమును ఇచ్చి గౌరవించింది. 1950లో 54 సంవత్సరాల వయస్సులో ప్రభుపాదుల వారు వైవాహిక జీవితాన్ని విడిచి పెట్టి ఎక్కువకాలం గ్రంథాలను చదవడానికీ, వ్రాయడానికీ వినియోగించ సాగారు. తరువాత వారు వృందావనానికి వెళ్ళి అక్కడ మధ్యయుగంలో చరిత్ర ప్రసిద్ధి కెక్కిన శ్రీశ్రీ రాధా దామోదర మందిరములో అతి నిరాడంబర జీవితమును గడిపారు. అక్కడే వారు చాలా సంవత్సరాలపాటు ఉండి ఎంతో విద్యా వ్యాసంగం

చేసి అనేక గ్రంథాలను రచించారు. 1959 లో సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించారు. తమ జీవిత ముఖ్య రచన అయిన శ్రీమద్భాగవతములోని 18,000 శ్లోకాలకు అనువాదము, వ్యాఖ్యానాలతో కూడిన అనేక సంపుటాలుగా రచనను ప్రారంభించారు. గ్రహాంతర సులభయానం అనే మరో గ్రంథాన్ని కూడా రచించారు.

శ్రీమద్భాగవతము మూడు సంపుటాలుగా ప్రచురించాక ప్రభుపాదుల వారు తమ ఆధ్యాత్మికాచార్యుల కోరికను నెరవేర్చడానికి 1965 లో అమెరికా సంయుక్త రాష్ట్రాలకు వెళ్ళారు. అప్పటి నుండీ వారు భారతీయ వేదాంత గ్రంథాలపై ప్రామాణికాలైన వ్యాఖ్యానాలు, భాషాంతరీకరణాలు, సంగ్రహ వ్యాఖ్యలు 70 సంపుటాలకు పైగా రచించారు.

1965 లో మొట్టమొదటిసారిగా ఒక వాణిజ్యనౌకలో న్యూయార్కు నగరానికి వెళ్ళినప్పుడు వారిదగ్గర ఒక్కపైస కూడా లేదు. తరువాత ఒక సంవత్సరానికి అంటే 1966 జూలైలో వారు అతికష్టము మీద అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘాన్ని (ఇస్కాన్) స్థాపించగలిగారు. పది సంవత్సరాల లోపలే ఆ సమాజము బాగా అభివృద్ధి చెంది ప్రపంచమంతట వ్యాపించసాగింది. పాఠశాలలు, మందిరాలను, ఆశ్రమాలు మొదలైన వాటిని నెలకొల్పసాగింది.

1968 లో శ్రీల ప్రభుపాదుల వారు న్యూవర్జీనియాలోని కొండల పైన ఆధ్యాత్మిక సమాజాన్ని స్థాపించి దానికి నూతన వృందావనం అని పేరును పెట్టారు. అక్కడే ఒక వైదిక పాఠశాలను నెలకొల్పి పాశ్చాత్యదేశాలకు సైతం వైదిక గురుకుల విద్యావిధానాన్ని అందుబాటులోకి తెచ్చారు. ఆ నూతన వృందావనం ఇప్పుడు వేయి ఎకరాలకు పైగా వైశాల్యం గల ప్రదేశంలో విరాజిల్లుతుంది. అమెరికాలోని వారి శిష్యులు అలాంటి సంఘాలను చాలా వాటిని స్థాపించారు.

1972 లో పరమపూజ్యశ్రీ శ్రీమత్ ప్రభుపాదుల వారు పాశ్చాత్య దేశాలలోని డెల్లాస్, టెక్సాస్‌లలో వైదిక పద్ధతిలో గురుకులాలను ఏర్పాటు చేశారు. 1972లో ముగ్గురు విద్యార్థులతో ప్రారంభమైన గురుకులము 1975 నాటికి 150 మంది విద్యార్థులతో విరాజిల్లింది.

శ్రీల ప్రభుపాదుల వారు భారత దేశములో అంతర్జాతీయ కేంద్రాలను నిర్మింపచేయడానికి ప్రోత్సహించారు. పశ్చిమ బెంగాలులోని మాయాపూరులో

శ్రీధామమనే అంతర్జాతీయ ఆధ్యాత్మిక కేంద్రాన్ని నిర్మించ తలపెట్టారు. అతివిస్తృతమైన ఆ పథక నిర్మాణానికి చాలాకాలము పట్టవచ్చును. అది వైదిక శాస్త్ర పఠనానికి కూడ అనుకూలంగా నిర్మించబడింది. భారత దేశములోని వృందావనంలో మహోన్నతమైన కృష్ణబలరామ మందిరము ఆ పద్ధతుల ప్రకారమే నిర్మించబడింది. అక్కడ ఒక అంతర్జాతీయ అతిథి గృహము కూడ నిర్మించబడింది. పాశ్చాత్యులక్కడ నుండి వైదిక సంస్కృతిని స్వయంగా నేర్చుకునే అవకాశము ఉంది. బొంబాయిలో ప్రధాన సాంస్కృతిక విద్యాకేంద్రం కూడ గలదు. భారత దేశములో షుమారు పద్దెనిమిది ముఖ్యస్థానాలలో ఇతర కేంద్రాల నిర్మాణము కొనసాగుతుంది.

శ్రీల ప్రభుపాదుల వారి ముఖ్యాతి ముఖ్యమైన సేవ గ్రంథరచన. దాని ద్వారా వారు ఎంతో ప్రసిద్ధిని పొందారు. వారి గ్రంథాలు ప్రామాణికత్వానికీ, జ్ఞాన గాంభీర్యానికీ, వైదుష్యానికి పెట్టింది పేరు. అవి విద్వాంసుల చేత ఎంతగానో గౌరవించబడ్డాయి. అనేక కళాశాలల్లో, పాఠశాలల్లో ప్రామాణిక పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించబడ్డాయి. వారి రచనలు ఎనభైకి పైగా భాషలలోకి అనువదించబడ్డాయి. ప్రభుపాదుల వారి గ్రంథాలను ముద్రించి, ప్రకటించడము కోసమే 1972 లో భక్తివేదాంత బుక్ ట్రస్ట్ అనే సంస్థను స్థాపించారు. అది ఇప్పుడు భారతీయ వైదికతత్త్వ విషయాలపై గ్రంథాలను ప్రచురించే ప్రపంచ ప్రముఖ ప్రచురణ సంస్థగా రూపొందింది.

వార్ధక్యం సమీపిస్తున్నప్పటికీ [illegible] పన్నెండు సంవత్సరాలలో శ్రీల ప్రభుపాదుల వారు ప్రపంచమంతట పద్నాలుగుసార్లు ఉపన్యాస యాత్ర సాగిస్తూ ఆరుఖండాలలో పర్యటించారు. అంతటి నిర్విరామ కార్యక్రమాలలో నిమగ్నులై ఉన్నప్పటికీ వారు తమ గ్రంథ రచనను కొనసాగిస్తూనే ఉండేవారు. వారి గ్రంథాలన్నిటినీ కలిపితే ఒక ప్రఖ్యాత వైదిక వేదాంత సాహిత్య సంస్కృతీ గ్రంథాలయము అవుతుంది.

1977 నవంబరు 14వ తేదీన వారు ఉత్తరప్రదేశ్‌లోఇని వృందావనములో తిరోభవించే వరకు నిర్విరామముగా శ్రమించారు. ప్రపంచమంతట వందకు పైగా ఆశ్రమాలను, మందిరాలను, సంస్థలను స్థాపించి కృష్ణ చైతన్య సంఘాన్ని అంతర్జాతీయ సంస్థగా (ఇస్కాన్) తీర్చిదిద్దారు.

**Check List**

| | | | |
|---|---|---|---|
| Book Number | BNR03A106 | Date | 9/6/21 |
| Front Cover | YES | Back Cover | YES |
| Blank Pages | 9I, 109 | | |
| Missing Pages | NO | | |
| Prepared | Swathi | Scanned | Swathi |
| BOOK SIZE | H 7-2 W 4.6 | Pages | 117 |